శ్రీ గురుభ్యో నమః



ఆచార్యదేవో భవ



సత్యసనాతన వైదిక ధర్మాన్ని బోధిస్తూ
సమాజాన్ని సన్మార్గంలో నడిపించు ఆచార్యుడే



# ఆదర్శ గురువు

గురువు-ఆచార్యుల లక్షణాలు-శిష్యుల కర్తవ్యాలు-శాస్త్రప్రమాణాలతో


గ్రంథ నిర్మాణకర్త

వాచస్పతి, సిద్ధాంతాలంకార, విద్యాభూషణ, ఆర్షవిద్యావినోద,
వేదరత్న, వేదాచార్య, వేదభాస్కర

**డా॥ మట్టి కృష్ణారెడ్డి**

M.A., M.Ed., Ph.D., D.Lit

# విషయసూచిక

- సత్యాన్ని గ్రహింపజేసి, అసత్యాన్ని త్యజింపజేయువాడే 'గురువు'.
- సాంగోపాంగంగా వేదాలను చదివి-చదివించువాడు, సత్యాచారాన్ని గ్రహింపజేసి-అసత్యాచారాన్ని త్యజింపజేయువాడు ఆచార్యుడు.

- మహర్షి దయానందసరస్వతి.

# ముందుమాట

## దీన్ని చదివే ముందుకు సాగండి

మన వైదిక-హైందవ సంప్రదాయంలో గురువుకు అత్యంత విశిష్టమైన, ఉన్నతమైన స్థానమున్నది. ఆత్మజ్ఞానం ద్వారా స్వస్వరూపస్థితిని తెలుసుకొని మోక్షాన్ని పొందాలని తపనపడువారికి గురువు యొక్క అవసరం చాలా ఉంది. అతని బోధన వలననే వివేక జ్ఞానం లభిస్తుంది.

మనలో ఉన్న అజ్ఞానాంధకారాలను నశింపచేయగల శక్తి ఒక గురువుకు మాత్రమే కలదని శాస్త్రాలలో సుస్పష్టంగా తెలియచేయబడింది. ఎన్ని గ్రంథాలు చదివినా, జపాలు, తపస్సులు, హోమాలు చేసినా లభించని జ్ఞానం గురువు యొక్క అనుభవజ్ఞానంతో కూడిన శాస్త్రబోధ వల్ల లభిస్తుంది. ఈ విధంగా లభించిన జ్ఞానం ద్వారానే వివేకజ్ఞానం కలిగి ముక్తి కలుగుతుంది.

వేదభూమియైన మన భరతభూమిలో వేదకాలం నుంచి నేటివరకు సద్గురువులకు కొదువలేదు. వేదాన్ని విశ్వానికందించిన పరమేశ్వరుడు ఆదిగురువైతే పరంపరాగతంగా వేదసారాన్ని మనకందించిన మహర్షులు వ్యావహారికంగా మనకు తొలి గురువులయ్యారు. భగవద్గీత రూపంలో వేదాల, ఉపనిషత్తుల సారాన్ని, జీవిత పరమార్థాన్ని కురుక్షేత్ర సంగ్రామంలో అర్జునునికి ఉపదేశించిన శ్రీకృష్ణుడూ గురువే. అందుచేతనే మనం **"కృష్ణం వందే జగద్గురుమ్"**

అంటున్నాం. కాని ద్వాపర యుగానికి ముందుయుగాలలో కూడా వ్యాస, వశిష్ఠ, విశ్వామిత్ర, భరద్వాజ, కపిల, గౌతమ, పరాశర, జైమిని అగస్త్యాది మహర్షులు అటు పాలించే రాజులకు, ఇటు పాలింపబడే ప్రజలకు ధర్మబోధ చేసి తమ కర్తవ్యాన్ని నిర్వహించారు.

యుగాలు మారినా, తరాలు మారినా ఈ గురు పరంపర కొనసాగుతూనే ఉన్నది. ఉంటుంది కూడా. మన భరతభూమిలో జన్మించిన ఆధ్యాత్మిక గురువుల శిష్యులు పరంపరగా నేటికీ తమ కర్తవ్యపాలన చేస్తూనే ఉన్నారు. మనదేశంలోనే కాక విదేశాలలో సైతం తమ బోధలను ప్రజలకు అందజేసి, వారిలో ఆధ్యాత్మిక చైతన్యాన్ని రగిలిస్తున్నారు. మత విద్వేషాలను తగ్గించి, ఉగ్రవాదాన్ని ఖండించి, విశ్వశాంతి కొరకు తమవంతు కృషిని చేస్తున్నారు. ఇది చాలా అభినందించాల్సిన విషయం.

కాని ఈ కలియుగంలో, యుగ ధర్మాన్ని బట్టి నకిలీ బాబాలు, దొంగ స్వామీజీలు ఎక్కువయ్యారు. ప్రజలను తమ మాయమాటలతో ఆకర్షించడం, ముక్తి, మోక్షం లాంటి మాటలను పదేపదే వాడుతూ, ఆత్మసాక్షాత్కారం అనే దానిని బజారులో కొనదగిన వస్తువుగా నమ్మించడం, శక్తిపాతం, రోగనివారణ, దోషనివారణ, ఐశ్వర్యప్రాప్తి మొదలగు అబద్ధపు మాటలతో వారిని ప్రలోభాలకు గురిచేసి, వారినుంచి పెద్ద ఎత్తున ధనాన్ని రాబట్టడం వంటి అధార్మిక, అనైతిక కార్యాలు చేస్తున్నారు. ఇటువంటి ఆధ్యాత్మిక వ్యాపారుల వల్ల మన సనాతన ధర్మానికి చాలా చెడ్డపేరు వస్తోంది. ఇప్పటికే వచ్చింది. అందువల్ల, **"పురుషులందు పుణ్యపురుషులు వేరయా"** అన్నట్లు **"గురువులందు సద్గురువులు వేరయా"** అని అనవలసి వస్తుంది.

మన సనాతన ధర్మంలో పొందుపరచబడిన అంశాలు ఎన్నో ఉన్నత ఆదర్శాలతో, ఉత్తమ విలువలతో కూడుకున్నవి. వీటిని సరియైనరీతిలో అందించే సద్గురువులను మనం ఆశ్రయించాలి. అంతేగాని వాటిని వక్రీకరించే

వారి వద్దకు వెళ్ళకూడదు. మన ప్రాచీన శాస్త్రాలపైన, పురాణేతిహాసాలపైన వక్రభాష్యం చెప్పేవారిపట్ల ఆసక్తి కనబరచరాదు. మనల్ని ప్రలోభ పెట్టాలని చూసే నకిలీబాబాలు, స్వామీజీల పట్ల అప్రమత్తంగా ఉండాలి. అలా ఉండాలంటే ఇన్ని శతాబ్దాలుగా ఈ భారత జాతిని పరిరక్షిస్తున్న వేదాలను, వైదికధర్మాలను, వేదధర్మ ప్రచారకులైన మహర్షుల, మహాత్ముల, ఆచార్యుల, పండితుల గ్రంథాలను మనం చదవాలి. భక్తి, జ్ఞాన, వైరాగ్యాలను సరియైన పాళ్ళలో మనకు అందిస్తూ, మనలోని సత్త్వరజస్తమోగుణాలు అదుపు తప్పి ప్రవర్తించకుండా మన జీవితాలను సక్రమమైన మార్గంలో నడిపించే సద్గురువు ఎవరో తెలుసుకొని వారినాశ్రయించి అమూల్యమైన ఈ మానవ జీవితాన్ని సక్రమమైనమార్గంలో నడిపించి చరితార్థులు కావాలని తెలియజెప్పడమే ఈ గ్రంథనిర్మాణ ప్రధానోద్దేశ్యం.

- డా॥ మట్టి కృష్ణారెడ్డి

## గురువు పట్ల ఇలా మెలగాలి

♦ గురువు వస్తున్నప్పుడు కూర్చుండరాదు. ♦ గురుశిష్యులు ఒక్క శయ్య మీద నిద్రించరాదు. ♦ గురువు కంటే ముందు భుజించరాదు. ♦ గురునింద వినరాదు. చేయరాదు. ♦గురువుకు ఇష్టం లేని పనులు చేయరాదు. ♦గురువాజ్ఞను మీరరాదు. గురువును శాసింపరాదు. ♦గురువు బోధింపదలచినప్పుడు వద్దనరాదు. బోధింపకుండిన అడుగరాదు. ♦ గురువును చేరినంతనె నమస్కారం చేయాలి. ♦గురుపుత్రుడిని, అతని స్నేహితుడిని, సోదరుడిని వారు గుణహీనులైన నిదించరాదు. ♦గురువు ఇచ్చు చిన్న కానుకను కూడా గొప్పగా భవించాలి.

# ఈశ్వర ప్రార్థన

యో భూతం చ భవ్యం చ సర్వం యశ్చాధితిష్ఠతి ।
సర్వస్య చ కేవలం తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః ।
యస్య భూమిః ప్రమాన్తరిక్షముతోదరమ్ ।
దివం యశ్చక్రే మూర్ధానం తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః॥
యస్య సూర్యశ్చక్షుశ్చంద్రమాశ్చ పునర్ణవః ।
అగ్నిం యశ్చక్ర ఆస్యం తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః॥
యస్య వాతః ప్రాణాపానౌ చక్షురఙ్గిరసోఽభవన్ ।
దిశో యశ్చక్రే ప్రజ్ఞానీస్తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః॥

# గురు వందనము

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యా సంప్రదాయకర్తృభ్యో
వంశ ఋషిభ్యో మహద్భ్యో నమో గురుభ్యః

అఖణ్డమణ్డలాకారం వ్యాప్తం యేన చరాచరమ్ ।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః ॥

అజ్ఞానతిమిరాన్ధస్య, జ్ఞానాఞ్జనశలాకయా ।
చక్షురున్మీలితం యేన, తస్మై శ్రీగురవే నమః ॥

స్థావరం జఙ్గమం వ్యాప్తమ్, యత్కిఞ్చిత్ స చరాచరమ్ ।
తత్పదం దర్శితం యేన, తస్మై శ్రీగురువే నమః ॥

చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యం స చరాచరమ్ ।
తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురువే నమః ॥

అనేకజన్మ సమ్ప్రాప్తకర్మబన్ధవిదాహినే ।
ఆత్మజ్ఞానప్రదానేన తస్మై శ్రీగురువే నమః ॥

ఓమ్ శాంతిశ్శాంతిశ్శాంతిః

# ఆదర్శ గురువు

పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాన్నాస్త్యకృతః కృతేన ।
తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్॥
ముండకోపనిషత్తు. 1-2-12.

వివేకంగలవాడు కర్మలచే కలుగు ఫలితాలను బాగా పరీక్షించి 'ఈ ప్రపంచంలోని వస్తువులన్నీ శాశ్వతానందాన్ని ఇవ్వలే'వని తెలిసికొని వైరాగ్యాన్ని పొంది శాశ్వతానంద ప్రదాతయగు పరబ్రహ్మను తెలుసు కొనుటకు సమిత్పాణియై శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడునైన గురువును ఆశ్రయించాలి.

## గురువు ఎందుకు?

మనం మనకు తోచిన విధంగా ప్రయాణం చేస్తుంటే దారితప్పే అవకాశముంది. సకాలంలో చేరుకోవాల్సిన గమ్యాన్ని చేరుకోలేం. దారిలో మార్గసూచనలు లేకుంటే ప్రయాణంలో దారి తప్పే అవకాశాలు చాలా ఉంటాయి. దారి తెలియక పెడదారినపడి పెనుఇబ్బందులకు గురికావలసి వస్తుంది. అందుకే మార్గసూచనలు, మార్గదర్శుల సలహాలు అవసరం. మానవ జీవిత లక్ష్యం మోక్షాన్ని పొందడం. జననమరణాలు లేని స్థితిని పొందడం. ఇంతటి గొప్ప లక్ష్యమున్న మానవ జీవితాన్ని సన్మార్గంలో నడిపించి సకాలంలో గమ్యాన్ని చేరుకునేటట్లు నడిపించే గురువు అవసరం. అతడు తన జ్ఞాన బోధనలతో జీవితమార్గాన్ని చూపగలడు. స్పష్టమైన ఆలోచనలను ఇవ్వగలడు. తగిన సమాచారాన్ని ఇచ్చి సహాయం చేయగలడు. ఇలా చక్కనైన తరించే రహదారిని చూపేవారినే **'గురువు'** అంటారు.

కాని, నేడు కొందరు దొంగ గురువుల వల్ల, మోసగాళ్ళవల్ల గొప్పనైన ఈ **'గురువు'** అనే పదం, వారి స్థానం పూర్తిగా వక్రీకరించబడింది. గురువంటే

దొంగ, మోసగాడు, దగాకోరు అనే స్థాయికి దిగజారింది. కాబట్టే చాలామంది ఎవరినీ కూడా గురువుగా అంగీకరించక అజ్ఞానంతో దారి తప్పుచున్నారు. ఇంకొందరు ఏ ఒక్కరినీ గురువుగా విశ్వసించక ఒకరి తరువాత ఒకరిని మారుస్తూ తిరుగుచున్నారు. మరికొందరు భోగలాలసులై, నాస్తికులై గురువునే -గురుస్థానాన్నే దూషిస్తున్నారు. కొందరు మరీ ముందుకు సాగి గురువులు-పరమగురువులు లేరని వితండవాదనలు చేస్తున్నారు. ఇలాంటి వారికి సద్గురువెవరో తెలియచెప్పడానికే ఈ గ్రంథరచన.

ఆత్మజ్ఞానాన్ని తెలుసుకోవాలనే తపనగల జిజ్ఞాసువులకు మంచి గురువు దొరుకుతాడు. ఎవరి సాన్నిధ్యంలో తనలో సరియైన మార్పు కలుగుతుందో, ఎవరు నిరాడంబరమైన, ఆదర్శమైన జీవితాన్ని గడుపుతున్నారో, ఎవరిని ఆశ్రయిస్తే శాంతి లభిస్తుందో వారినే తనకు సరియైన గురువుగా తెలుసుకుంటాడు. నిస్వార్థమైన సేవాతత్త్వం గల గురువే పరిపూర్ణత చెందినవాడనడానికి గీటురాయి. ఇలాంటి వ్యక్తినే **"సద్గురువు"**గా స్వీకరించాలి. వేదవిద్య, ఆధ్యాత్మిక విద్య, యోగవిద్య లేకుండా డంబాచారం, ధనార్జన, స్వీయ ప్రచారం, ఆడంబరం, దిఖావట్, షోపుటాపు గలవానిని **"దుర్గురువు"**గా భావించాలి.

గురువులందరికీ ఒకటే లక్ష్యముంటుంది. తన చుట్టూ చేరినవారి నిజస్వరూపాన్ని గుర్తుచేసి, వారు అమరులని, జ్ఞానస్వరూపులని ఎవరికి వారు అనుభవపూర్వకంగా తెలుసుకునేటట్లు చేస్తారు. వారికి మార్గదర్శనం చేయటమే వారి లక్ష్యం.

## గురువు మార్గదర్శి

పర్వతారోహణానికి సాధనాలు, శిక్షణ ఎలా అవసరమో అంతరంగ (మోక్ష) ప్రయాణానికి కూడా అవి అవసరం. ఆ జిజ్ఞాస ఉన్నవాడు గురువు కొరకు అన్వేషణ చేస్తాడు. అలాంటి గురువును గుర్తించి ఆశ్రయిస్తాడు. ఆ గురువు యొక్క సాన్నిధ్య ప్రభావంతో సాధకుడైన శిష్యునిలో మార్పు వస్తుంది.

అది అయస్కాంతం ముందుగల ఇనుపముక్కలో కలిగిన మార్పువంటిది. గురువు యొక్క సదాచరణ శిష్యునిలో సత్ప్రేరణ కలిగిస్తుంది. ఆ ప్రేరణ శిష్యుని ప్రజ్ఞను ఊర్ధ్వముఖం చేస్తుంది. అతడు చేయు సాధనలో నాణ్యతను మెరుగుపరుస్తుంది.

## ఆ గురువులకు గురువు ఎవరు?

మానవసృష్టి ప్రారంభమైన నాటి నుండే జ్ఞానం కూడా ఉన్నట్లు వేదశాస్త్రాలు తెలుపుచున్నవి. అలాగే గురుశిష్య సంప్రదాయమూ ఆనాటి నుండే ప్రారంభమైనది.

యోగదర్శన శాస్త్రంలో "**సః -పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాత్.** యోగ.ద.1-24. సమస్త జీవుల హృదయాలలో ఉన్న దైవమే సమస్త గురువులకు గురువు" అని ఉంది. సమస్త జ్ఞానానికీ, పరిపూర్ణతకూ అతడే బీజం. అతడే జీవులందరి దైవప్రజ్ఞ. అది ఒక తత్త్వం. మనిషికాదు. సమస్త జీవుల అంతరంగంలో అతడున్నాడు. అందుకే మనకంటే ముందే వచ్చినవారిచేత గురువుగా సేవింపబడ్డాడు. అతడే పరమగురువు.

## ఆ పరమగురువే జగద్గురువు:

సృష్టి స్థితిలయకారకుడైన ఆ పరమేశ్వరుడే జగద్గురువు. జగత్తునంతటినీ అతడే త్రికాలాతీతుడై నడిపిస్తున్నాడు. అతని స్వరూపమే గురుతత్త్వము. కాని చాలామంది పరమగురువైన పరమేశ్వరుని గురుతత్త్వం కంటే గురుబోధచేసిన లౌకికులైన అనగా పుట్టి మరణించినవారి రూపాలకే-ప్రతిరూపాలకే ప్రాధాన్యతనిస్తున్నారు. అటువంటివారు ఈ లౌకిక గురువుల వ్యక్తిత్వం చుట్టూ ఒక విధమైన ఆరాధనా విధానాన్ని, మతాన్ని తయారుచేసి ఇతరుల యెడల అసూయ కలిగి ఉంటారు. కానీ, ప్రతి గురువు నిజానికి జగద్గురువుతత్వానికి ప్రతినిధియై ఉంటాడు. ఒకే గురుతత్త్వము అనేక మంది గురువుల ద్వారా పనిచేస్తుంది. ఆ గురుతత్త్వాన్నే జగద్గురువంటారు.

## ఈ జగద్గురు పీఠాల మాటేమిటి?

సనాతనమైన వేదధర్మాన్ని బోధించడానికి, అవైదికమైన మూఢాచారాలను, దురాచారాలను పారద్రోలడానికి, నాస్తికత్వాన్ని తొలగించడానికి ఆదిశంకరాచార్యులు తొలుదొల్త దేశం నలుమూలలా నాలుగు పీఠాలను స్థాపించాడు. అతని తర్వాత అవి ఆదిశంకరాచార్య పీఠాలు మారినవి. అసలైన జగద్గురువు స్థానంలో లౌకిక గురువులను ఆరాధించడం ప్రారంభమైంది. దీనితో వ్యక్తిగత పీఠాలకు, వ్యక్తులకు ప్రాధాన్యత పెరిగింది. రానురాను అనేక పీఠాలు, మఠాలు వెలిసినవి. వైదికధర్మ ప్రచారం పోయి తమ తమ వ్యక్తిగత పీఠాల, మఠాల మతప్రచారం పెరిగింది.

## నిజమైన గురువు-అసలైన బోధలు

శాశ్వత జ్ఞానాన్ని అందించు నిజమైన గురువులు ఆదర్శవంతమైన సాధారణ జీవితాన్ని గడుపుతూనే అంతరంగ సాధన ఎలా చేయవచ్చో ఆచరించి చూపగలరు. ఆధ్యాత్మిక పురోగతి ఆధారంగా వారు ధ్యానం, ఆధ్యాత్మిక గ్రంథాధ్యయనం, సమస్త జీవులసేవ మొదలైనవి మౌనంగా ఆర్భాటాలు లేకుండా ఆచరించి చూపిస్తారు. వారు ఆ యా కాలాలకు తగినట్లుగా జిజ్ఞాసువులకు బోధనల ద్వారా సత్యాన్ని తెలుపుతారు. వారి బోధనల ద్వారా మానవ సమాజంలో ఐక్యత పెంపొందుతుంది. సమసమాజ నిర్మాణం జరుగుతుంది. అట్టివారు మన జీవితాలకు ఆదర్శప్రాయులౌతారు. మన తర్వాతి తరాలకు మార్గదర్శకులౌతారు. ఇవే నిజమైన గురువుయొక్క అసలైన బోధలు.

## గురుపరంపర -కర్తవ్యం

ఆధ్యాత్మిక జ్ఞానాన్ని కాలానుగుణంగా సమకాలీన ప్రజలకు ప్రబోధిస్తూ వారిని సన్మార్గంలో నడిపిస్తూ పరంపరగా వస్తున్న సత్యసనాతన వైదిక ధర్మాన్ని ముందుతరాలకు ఒకరిచేతుల మీదుగా ఒకరికి ఈ జ్ఞానపరంపరను అందిస్తూ

గురుశిష్య పరంపరగా ఈ గురుపరంపరను ముందుకు కొనసాగిస్తున్నారు. సమాజంలోగల మూఢాచారాలను తెలియపరుస్తూ ఆ యా సమయాలలో వచ్చే అనాచారాలను దురాచారాలని తెలుపుతూ మానవజీవితాలను ఉద్ధరించడమే గురుపరంపర కర్తవ్యం.

కాలగమనంలో త్రైతసిద్ధాంతం గల వైదికమతం ఆ యా మత ప్రచారకుల కారణంగా ద్వైతాద్వైత విశిష్టాద్వైతాలుగా ఏర్పడినవి. నిజానికి ఈ త్రిమతాచార్యుల సిద్ధాంతం వేదవిరుద్ధం. వేదం పేరుతో ప్రచలితమైనందున ఇవి సమాజంలో నిలిచిపోయినవి.

ఆధునిక యుగంలో మహర్షి దయానందసరస్వతి వేదవేదాంగ సర్వశాస్త్రపారంగతుడై వేదసిద్ధాంతాన్ని అవగతం చేసుకొని భారతదేశంలో వేదం పేరున వెలసిన ఈ ద్వైతాద్వైతవిశిష్టాద్వైతాలను ఖండించి ఆదిలో గల అసలైన త్రైతసిద్ధాంతాన్ని పునరుద్ధరించినాడు. అంతేగాక ప్రపంచంలో వెలసిన అనేక మతాల మూలాలను తెలుసుకొని అందులోగల వేదవిరుద్ధ- తర్కవిరుద్ధ, అవైజ్ఞానిక మూలాలను పెకిలించి అందులోగల దోషాలను తెలిసికొని విశ్వంలో సత్యసిద్ధాంతమేదో తెలియపరచి 'సత్యార్థ ప్రకాశం' రచించినాడు.

నేటి పీఠాలన్నీ తమ తమ వ్యక్తిగత ప్రచారాలకు, ఆస్తుల సంపాదనకు ఆడంబరాలకు, దంబాచారాలకు ఇస్తున్నంత ప్రాధాన్యాన్ని మానవులకు ముక్తిని కలిగించు మోక్షవిద్యకు ఇవ్వడం లేదు. వారు అహింసాపరులై మోక్షగాములగుటకు బోధించడం లేదు. తమ తమ చిత్రపటాలకు, వారి వారి పీఠాలకు, పాదాలకు ప్రణమిల్లుతే చాలు అదే మోక్షమన్నట్లు ప్రజలను మోసగిస్తున్నారు. లేని మహిమలను కల్పించుకొని ప్రజలను ఊహాకల్పనాలలో ఊరేగిస్తున్నారు. ఇలాంటివి నిజమైన జగద్గురుపీఠాలు కావు. పరమేశ్వరుడే జగద్గురువు. అతని సత్యసిద్ధాంతాలను ప్రజలలో వ్యాప్తం చేయువారే గురువులు.

ప్రాచీనకాలం నుండి పరంపరగా వస్తున్న సనాతన ధర్మాన్ని కాపాడుతూ ముందుతరానికి అందించడం వారి బాధ్యత.

ఈ గురుపరంపరపైనా, వారి బోధనల మీదనూ అనేక రకాలైన స్పందనలు, విమర్శలు, తిరస్కరణలు, పక్షపాతాలు, ఊహాజనితాలు వస్తూ ఉంటాయి. కొందరు వారిపట్ల అల్లరి చిల్లరిగా కూడా మాట్లాడుతుంటారు. తప్పుడు ప్రచారం చేస్తుంటారు. మరి కొందరు గురుపరంపర కోసం వెతుకుతుంటారు. వెతికి వెతికి సద్గురువును పట్టుకుంటారు. ఆ సద్గురువు సాధారణంగా ఉంటూ, సామాన్యులలో ఒకడిగా ఉంటూ వారితో ప్రేమగా మెలుగుతూ మౌనంగా తనపని తాను చేసుకుంటూ తన చుట్టూ ఉన్నవారికి ఆదర్శప్రాయుడై వారికి స్ఫూర్తిని కలిగిస్తూ ఉంటాడు. తెలిసిన జ్ఞానాన్ని తెలుపుతూ ఎక్కువగా మాట్లాడేదానికంటే జీవితంలో దాన్ని ఆచరించి చూపిస్తాడు. వాడే ఆదర్శప్రాయుడౌతాడు. ఇదే నిజమైన గురుపరంపర.

## గురువు అద్దం వంటివాడు

అద్దంలో మన ప్రతిబింబాన్ని చూసుకుంటూ తలవెంట్రుకలను సరిచేసుకుంటూ, ముఖాన్ని అలంకరించుకొనునట్లు గురువు సమీపంలో ఉంటూ మన ప్రవర్తనను, ఆచరణను చూసుకుంటూ మన నడవడిని మనం చక్కదిద్దుకోవాలి. అతనిలోని సదాచారాన్ని గ్రహించి మనలో గురువుని చూసుకోవాలి. అప్పుడే మనల్ని మనం సరిచేసుకోవడం సరిదిద్దుకోవడం, ఏది తప్పో, ఏది ఒప్పో తెలుసుకోవడం సాధ్యపడుతుంది.

గురువు ప్రతిపాదనలు చేస్తాడు. దాన్ని మనం అందుకొని ఆచరించాలి. అతడు మార్గనిర్దేశం చేస్తాడు. ఆ మార్గంలో మనం నడవాలి. ఇతరుల కోసం

తన నిర్ణయాన్ని మార్చుకోడు. సాధకుల సమస్యల్ని తీరుస్తాడు. వారికి కావల్సిన జ్ఞానాన్ని అందిస్తాడు. స్వయంగా ఆలోచించి తగిన నిర్ణయాలు తీసుకోమని నిర్దేశిస్తాడు. సాధకుడు సూక్ష్మబుద్ధి కలిగి, నిర్ణయస్వేచ్ఛగలిగి దైవసంకల్పంతో ఏకత్వం కలిగి ఉండాలని సద్గురువు కోరుకుంటాడు. అద్దంలా ఉంటూ శిష్యుల దోషాలను వారికి కనిపించేలా చేస్తాడు.

## శిష్యునిదే బాధ్యత:

అధ్యాత్మిక జ్ఞానసాధనలో శిష్యునిదే ప్రధానమైన బాధ్యత. అతడు జిజ్ఞాసేచ్ఛకలవాడు కావడం చేత గురువు చెంత నిరంతరం జాగరూకుడై మెలగాలి. పూర్వపు రోజులలో గురువు శిష్యునకు బాధ్యతలు అప్పగించేవాడు. కఠినమైన పరీక్షలు పెట్టేవాడు. గురువు ఏది చెప్పినా శిష్యుడు ప్రశ్నించకుండా చేయాలి. గురువు ఆదేశాన్ని, సందేశాన్ని సందేహించకూడదు. పరిప్రశ్నయే తప్ప ఎదురు ప్రశ్న వేయకూడదు.

## నాటి గురువులు నిస్స్వార్థపరులు: -

నాటి గురువులు నిస్స్వార్థపరులు. ప్రతిఫలాపేక్షలేనివారు. సదా శిష్యుల శ్రేయస్సునే కాంక్షించేవారు. కాబట్టి శిష్యులు కూడా పూర్తి నమ్మకంతో సమర్పణభావంతో పూర్తి బాధ్యతతో మెలిగెడివారు. గురువు ఆజ్ఞనే శిరోధార్యంగా భావించేవారు. జ్ఞానమార్గాన్ని తెలుసుకొనుటకు కావలసినంత స్వేచ్ఛను గురువు వారికి ఇచ్చేవాడు. గురువు తనకు తాను శిష్యుణ్ణి తన దగ్గరకు ఆహ్వానించడు. శిష్యుడే వెతుక్కుంటూ అతని సన్నిధానానికి చేరుకుంటాడు. శుశ్రూష చేస్తూ గురువచనాలను శ్రవణం చేస్తాడు. జ్ఞానార్జన, యోగసాధనలో శిష్యునిదే

సంపూర్ణ బాధ్యత. గురువును ప్రసన్నం చేసుకొని అతని సంరక్షణలో ఉంటూ వారిని గౌరవిస్తూ, ఆరాధిస్తూ ఉత్తమ శిష్యునిగా విద్యలో పురోగమించాలి.

## గురుసన్నిధి:

గురువు సన్నిధానం, వారి ఈశ్వర జ్ఞానం జిజ్ఞాసువులలో కావలసిన మార్పులను కలిగిస్తుంది. అయస్కాంతానికి ఇనుపముక్క అతుక్కుని దాని స్వభావాన్ని పొందునట్లు శిష్యుడూ ఆ స్వభావంతో వెలుగుతాడు. గురువు జ్ఞానోపదేశంతో ఆనందభరితుడౌతాడు. అతని ముఖం జ్ఞానవర్చస్సుతో విద్యుత్కాంతిలా వెలుగుతుంది. గురువుబోధతో ప్రజ్ఞావికాసం కలుగుతుంది. ఇదే గురుసాన్నిధ్యం వల్ల కలిగే లాభం.

## శిష్యునిలో మార్పు

దీర్ఘకాలం గురుసన్నిధానంలో ఉంటూ క్రమం తప్పకుండా సాధన చేసినట్లైతే శిష్యునిలో పూర్వపు అలవాట్లు పూర్తిగా తొలగిపోతాయి. జీవితోన్నతికి కావలసిన మార్పులు స్థిరపడుతాయి. ప్రపంచంలో ఎవరిని చూసినా తనవలెనే కనబడతారు. భౌతిక అభౌతిక లోకాలలో సమర్థత కలిగి ఉంటారు.

'నేను ప్రపంచంలో ఉన్నాను- నాలో ప్రపంచం లేదు' అన్న స్థితికి అతడు ఎదుగుతాడు. గురుసన్నిధానంలో ఉంటూ గురుబోధలను ఆచరిస్తూ గొంగళి పురుగు సీతాకోక చిలుకగా మారినట్లు తనను తాను మార్చుకుంటాడు.

## ఆధ్యాత్మిక ప్రయాణం

ఈ ప్రయాణం సుదీర్ఘమైనది. అనేక జన్మలు పడుతాయి. ఒక్క జన్మలోనే ఇది పూర్తి కాదు. లక్ష్యాన్ని తెలుసుకుంటే పురోగతిలో వేగం పెరుగుతుంది. కాబట్టి గమ్యాన్ని అర్థం చేసుకొని గమనాన్ని సాగించాలి.

లక్ష్యం విలువ తెలిసినవాడు ఎన్ని కష్టాలనైనా భరించగలడు. దూరంగా ఉన్న వెలుగును చేరడానికి ఏ కష్టాన్నీ లెక్కచేయడు. ఎందుకంటే 'తన హృదయంలో ఉన్న వెలుగుతున్న వెలుగు ఆ వెలుగుతో పరిపూర్ణమౌతుంది. ఆ వెలుగు శాశ్వతమైనది. సదా ఆనందాన్ని కలిగించేది.

## గురువిశిష్టతను తెలిపే గురుపూర్ణిమ:

గురువు ఒక త్రిమూర్తి స్వరూపుడు. మనలో జ్ఞానాన్ని పుట్టించి, రక్షించి, చెడులను లయించి మంచి చెడులను విశదీకరించి మానవతా విలువలను, సద్గుణ సంపన్నతలను నేర్పుతాడు- అందుకే మన పెద్దలు-

**"గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షాత్ పరం బ్రహ్మా తస్మై శ్రీ గురవే నమః ॥** అన్నారు.

గురువే సృష్టిస్థితిలయకర్త అనికాదు దీని అర్థం. గురువు మనలో మంచిని సృష్టించి పోషిస్తూ చెడును దూరం చేస్తాడు. లోకంలో ఎలా జీవించాలో నేర్పుతాడు. ఎందుకు పుట్టామో తెలుపుతాడు.

అతడు మోహాన్ని తుంచివేసే శక్తిసంపన్నుడు. అజ్ఞానమనే చీకటిని పోగొట్టి జ్ఞానమనే వెలుగును వెలిగించేనేర్పరి.

భారతదేశంలో గల హిందువులు, వైదికులు ఆషాఢ శుద్ధ పూర్ణిమనాడు గురుపూర్ణిమ ఉత్సవాన్ని గొప్పగా జరుపుకుంటారు. దీనినే **'వ్యాసపూర్ణిమ'** అని కూడా అంటారు. జ్ఞానాన్ని కోరేవారు ఆరోజు తమ ఆధ్యాత్మిక గురువులను దర్శించి ఆరాధించి ఆశీస్సులు పొందుతారు. కృతజ్ఞతలను తెలియజేస్తారు. భుక్తివిద్యను కాక ముక్తివిద్యను బోధించువారిని గురువులుగా భావిస్తారు.

చంద్రుడు మనసునూ, సూర్యుడు బుద్ధినీ ప్రకాశింపజేస్తాడు. పూర్ణిమనాడు చంద్రుడు షోడశకళలతో వెలుగుతుంటాడు. ఆరోజు తమలోగల

అష్టమదాలూ, అరిషడ్వర్గాలూ, అహంకారచిత్తాలూ అనే 16 మలినాలు తొలగిపోవాలని ప్రార్థిస్తారు.

## గురువును ఎందుకు గుర్తుంచుకోవాలి?

గురువును ఎందుకు గుర్తుంచుకోవాలి? ఎందుకు స్మరించాలి? ఎందుకు దర్శించాలి? కృతజ్ఞతలు ఎందుకు తెలుపాలి? అనే సందేహాలు సహజంగా కలుగుతాయి. గురువు ఒక శిల్పిలాంటివాడు. బండరాళ్ళను అందమైన శిల్పాలుగా చెక్కినట్లు, స్వర్ణకారుడు బంగారాన్ని సానబెట్టి ఆభరణాలను తయారు చేయునట్లు, తోటమాలి సుందరమైన ఉపవనాన్ని ఫలపుష్పాదులతో అలంకరించునట్లు గురువు కూడా శిష్యులను సమాజానికి అలంకారాలుగా అందిస్తాడు. అందుకే గురువుని స్మరించాలి. దర్శించాలి. కృతజ్ఞతలు తెలుపాలి.

ఈ గురుపూర్ణిమయే 'వ్యాసపూర్ణిమ':- వ్యాసమహర్షి ద్వాపర యుగాంతంలో మానవజాతి అజ్ఞానాంధకారాన్ని పారద్రోలడానికి దైవత్వాన్ని చూపే పురాణేతిహాసశాస్త్రాలను అందించాడు. ఇతడు వశిష్టుని మనుమడు. పరాశరమహర్షి కుమారుడు. శుకమహర్షికి తండ్రి. ఇతడు వేదాలను విస్తారం చేయడం వలన వేదవ్యాసుడని ప్రసిద్ధిగాంచాడు.

## ఉత్తరాయణం, దక్షిణాయనమంటే ఏమిటి?

మన పూర్వీకులు సూర్యుని గమనాన్ని బట్టి కాలాన్ని క్షణాలుగా, నిమిషాలుగా, ఘడియలుగా, జాములుగా, రోజులుగా, వారాలుగా, పక్షాలుగా, మాసాలుగా, ఋతువులుగా, అయనాలుగా, సంవత్సరాలుగా, యుగాలుగా, మహాయుగాలుగా, మన్వంతరాలుగా విభజించారు.

సూర్యుడు మకరరాశిలో ప్రవేశించినపుడు ఉత్తరాయణమని, కర్కాటకంలో ప్రవేశించినపుడు దక్షిణాయనమని అన్నారు. ఒక్కో అయనం ఆరునెలలుంటుంది.

ఇంగ్లీషు క్యాలెండర్ ప్రకారం జనవరి 15 నుండి జూలై 15 వరకు ఉత్తరాయణమని, జూలై 16 నుండి జనవరి 15 వరకు దక్షిణాయనమని అంటారు.

## ఆషాఢపూర్ణిమ దక్షిణాయనానికి ప్రారంభదినం

'అయనం' అంటే ప్రయాణించడం అని అర్థం. ఉత్తరాయణమంటే సూర్యుడు ఉత్తరదిశలో ప్రయాణించడం అని అర్థం. సూర్యుడు ఆరునెలలు భూమధ్యరేఖకి ఉత్తరదిశకు, మరో ఆరునెలలు దక్షిణదిశకు పయనించడం జరుగుతుంది. సూర్యుడు పయనించే దిక్కును బట్టి దక్షిణం వైపుకి పయనిస్తున్నప్పుడు దక్షిణాయనమని, ఉత్తరవైపుకు పయనిస్తున్నప్పుడు ఉత్తరాయణమని అంటారు. సూర్యుడు పయనించే దిక్కునుబట్టి భూమిపైగల వాతావరణంలో అనేక మార్పులు సంభవిస్తుంటాయి.

## గురువు లక్షణాలు-ప్రశంస-మహిమ

**శ్లో. అజ్ఞానతిమిరాంధస్య, జ్ఞానాంజనశలాకయా ।**
**చక్షురున్మీలితం యేన, తస్మై శ్రీగురవే నమః ॥**

అజ్ఞాన మనే అంధకారముచే కప్పబడివున్న నా నేత్రములను శుద్ధజ్ఞానమను కాటుక కణికె చేత ఎవ్వడు తెరిపించెనో అట్టి గురుదేవునికి నా నమస్సులు.

శ్లో. శాంతో దాంతః కులీనశ్చ వినీతశ్శుద్ధవేషవాన్ ।
సదాచార స్సుప్రసిద్ధ శ్శుచిర్దక్ష స్సుబుద్ధిమాన్ ।
ఆశ్రమీ ధ్యాననిష్ఠశ్చ మంత్రతంత్ర విచక్షణః ।
నిగ్రహానుగ్రహే శక్తో గురురిత్యభిధీయతే ॥

శాంతుడు (అంతరింద్రియనిగ్రహము కలవాడు), దాంతుడు (బహిరింద్రియనిగ్రహం కలవాడు), ఉత్తమ కులమున బుట్టినవాడును, అణుకువ గలవాడును, పరిశుద్ధవేషములను ధరించువాడును, సదాచారము గలవాడును, గొప్ప ప్రసిద్ధి చెందినవాడును. శుచియు, సమర్థుడును, మంచిబుద్ధిమంతుడును, ఆశ్రమవంతుడును, ధ్యాననిష్ఠయందుండువాడును, మంత్రతంత్రములను బాగుగా తెలిసినవాడును, నిగ్రహించుటకు, అనుగ్రహించుటకు శక్తిగలవాడును అగు వ్యక్తి గురువనబడును.

శ్లో. సమాధిం చ పరం యోగం బహుభాగ్యేన లభ్యతే ।
గురోః కృపాప్రసాదేన ప్రాప్యతే గురుభక్తితః ॥ ఘేరండసంహిత

శ్రేష్ఠమైన సమాధియోగము బహుభాగ్యము వలనగాని లభింపదు. గురు ప్రసాదమువలనను, గురుభక్తి వలనను మాత్రమే అది లభించును.

శ్లో. సామృతైః పాణిభిర్ఘ్నన్తి గురవో న విషోక్షితైః ।
లాలనాశ్రయిణో దోషాస్తాడనాశ్రయిణో గుణాః ॥ మహాభారతం

గురువులు అమృత హస్తాలతో కొడతారు. విషపు చేతులతోకాదు. లాలించడంవల్ల దోషాలు, తాడించడంవల్ల గుణాలు కలుగుతాయి.

శ్లో. వ్యత్యస్త పాణినా కార్యముపసంగ్రహణం గురోః ।
సవ్యేన సవ్యః స్పృష్టవ్యో దక్షిణేన చ దక్షిణః ॥ మను. 2.72

రెండు చేతులను మార్చి పట్టుకుని (అనగా కుడిచేతితో గురువుయొక్క కుడిపాదాన్ని, ఎడమ చేతితో ఎడమపాదాన్ని) పట్టుకొని నమస్కరించాలి.

శ్లో. చాతుర్యవాన్ వివేకీ చ అధ్యాత్మజ్ఞానవాన్ శుచిః ।
మానసం నిర్మలం యస్య గురుత్వం తస్య శోభతే ॥ గురుగీత

చాతుర్యం కలవాడై, వివేకియై, ఆధ్యాత్మిక జ్ఞానసంపన్నుడై, బాహ్యాభ్యంతర శుద్ధికలవాడై, పవిత్రమైన మనస్సుకలవాడెవరో అతనికి 'గురు' శబ్దం వర్తిస్తుంది.

శ్లో. ఆచార్యో వేదసంపన్నో విష్ణుభక్తో విమత్సరః ।
మంత్రజ్ఞో మంత్రభక్తశ్చ సదా మంత్రాశ్రయశ్శుచిః ।
సత్సంప్రదాయసంయుక్తో బ్రహ్మవిద్యా విశారదః ।
అనన్యసాధనశ్చైవ తథాஉనన్య ప్రయోజనః ।
బ్రాహ్మణో వీతరాగశ్చ క్రోధలోభవివర్జితః ।
సద్వృత్తౌ శాసితాచైవ ముముక్షుః పరమార్థవిత్।
ఏవమాదిగుణోపేత ఆచార్య స్స ఉదాహృతః ॥

అద్వయతారకోపనిషత్తు

వేదసంపన్నుడును, సర్వవ్యాపక ఈశ్వర భక్తుడును, మత్సరము లేనివాడు, మంత్రరహస్యము తెలిసినవాడును, మంత్రమందు భక్తికలవాడును, నిరంతరము మంత్రము నాశ్రయించినవాడును, శుచియు, మంచి సంప్రదాయము కలవాడును, బ్రహ్మవిద్యను ఆమూలాగ్రముగా తెలిసినవాడును, ఇతర సాధనప్రయోజనములు లేనివాడును, బ్రాహ్మణుడును, రాగమును, క్రోధమును వదిలినవాడును, మంచి నడవడికయందు శిక్షితుడును, మోక్షమునందే కోరికకలవాడును, పరమార్థము ఎరిగినవాడును అగువాడే ఆచార్యుడని చెప్పబడును.

శ్లో. అల్పం వా బహు వా యస్య శ్రుతస్యోపకరోతి యః ।
తమపీహ గురుం విద్యాచ్ఛ్రుతోపక్రియయా తయా ॥
మను. 2. 149

అల్పమో, అధికమో వేదశాస్త్రోపదేశనిమిత్తం ఉపకరించిన వేదోపకారకమైన కార్యము నాచరించినవానిని గురువుగా అంగీకరించాలి.

శ్లో. గురవో బహవః సన్తి శిష్యవిత్తాపహారకాః ।
గురవో విరలాః సన్తి శిష్యసన్తాపహారకాః ॥ గురుగీత

శిష్యుల ధనాన్ని దొంగిలించే గురువులు చాలామంది ఉంటారు. కాని శిష్యుల దుఃఖాలను దూరం చేసే గురువులు మాత్రం తక్కువగా ఉంటారు.

## శిష్యుని లక్షణాలు

శ్లో. శాంతో వినీత శ్శుద్ధాత్మా శ్రద్ధావాన్ ధారణాక్షమః ।
సమర్థశ్చ కులీనశ్చ ప్రాజ్ఞస్సుచరితో ధనీ ।
ఏవమాది గుణైర్యుక్త శ్శిష్యో భవతి నాన్యథా ॥

శాంతి, వినయము, పరిశుద్ధాంతఃకరణము, శ్రద్ధ, జ్ఞాపకశక్తి సమర్థత, కులీనత, సద్బుద్ధి, మంచి నడవడిక అనే సంపదగలవాడు, శిష్యుడుగా ఉండదగినవాడు. ఇట్టి శిష్యుడు తన గురువును దైవంవలె భావించాలి.

శ్లో. యథా ఖనన్ ఖనిత్రేణ నరో వార్యధిగచ్ఛతి ।
తథా గురుగతాం విద్యాం శుశ్రూషురధిగచ్ఛతి ॥మను. 2. 218

పలుగుతో తవ్వి నేలనుండి నీటిని పొందేలాగున, గురువు వద్దగల విద్యను శ్రద్ధాభక్తులతో గురుశుశ్రూష చేసి శిష్యుడు పొందవలెను.

# మనుస్మృతిలో గురుశిష్యసంబంధం

శిష్యుడు ప్రతిదినం గురువు చెప్పినా, చెప్పక పోయినా అధ్యయనంలో గురుహిత కార్యాలలో శ్రద్ధ వహించాలి. శరీరమును, బుద్ధిని, ఇంద్రియాలను, మనస్సును నిగ్రహించుకొని గురువు ఆజ్ఞకై నిలుచుండి అంజలి ఘటించి చూడాలి. ఎప్పుడును ఉత్తరీయమును కుడిభుజం వెలుపల ఉండునట్లు కప్పుకొని, గురువు కూర్చొనుమని చెప్పిన తరువాత కూర్చోవాలి.

గురువు సన్నిధానంలో గురువుకంటె తక్కువ ప్రాధాన్యత గల ఆహారమును, వస్త్రమును, వేషమును గలవాడై ఉండాలి. గురువుకంటె ముందు నిద్రలేచి, అతడు పరుండిన తరువాత పడుకోవాలి. శిష్యుడు పడుకొని గాని, కూర్చొని గాని, భోజనం చేస్తూ కాని, పెడమొగముతో గాని గురువుతో మాట్లాడ కూడదు. ఆయనకు ఎదురు చెప్ప కూడదు. ఆసనమున గూర్చుండి గురువు ఆజ్ఞ యిచ్చిన శిష్యుడు తాను నిలుచుండియు, నిలుచుండి యిచ్చిన దాపున నిలుచుండియు, దూరంగావున్న దగ్గరకు పోయియు పెడమొగముతోనున్న ఎదురేగియు, పరుగిడుచున్న తాను వెంబడి పరుగిడుచును దానిని నిర్వర్తించుటగాని, మాట్లాడుటగాని చేయాలి. గురుసన్నిధిలో శిష్యుడు గురువుకన్న తక్కువ ఎత్తైన ఆసనం మీద కూర్చొనాలి. కాళ్లు చాచుకొని కూర్చొనరాదు.

చాటుగానైనా గురువు పేరు చెప్ప గూడదు. మా గురువుగారు, మా ఉపాధ్యాయులు అని చెప్పాలి. గురువు వలె నడిచి, మాట్లాడి, నటించి ఆయనను వెక్కిరించకూడదు. గురునింద, అపవాదము జరిగినపుడు చెవులు మూసికొని

అక్కడనుండి మరోచోటికి వెళ్లిపోవాలి. శిష్యుడు గురువు మీద అపవాదం మోపిన గాడిదగాను, నిందించిన కుక్కగాను, గురుధనాన్ని అనుభవించిన క్రిమి (చిన్నపురుగు) గాను, ద్వేషించిన కీటకము (విష పురుగు) గాను జన్మిస్తాడు.

గురువు కోపంతో ఉన్నప్పుడు, స్త్రీసమేతుడై ఉన్నప్పుడు ఆయనను పూజించరాదు. తాను బండిమీద పోయేటప్పుడు, పీఠం మీద కూర్చున్నప్పుడు దిగి గురువుకు నమస్కారం చేయాలి. బండి, మేడ, బండ, చాప, శిలాఫలకం, నావ వీని మీద కూర్చున్నప్పుడు మాత్రం గురువుతో సమానంగా కూర్చొనవచ్చును.

గురువుగారి గురువుకు అభివాదం చేయాలి. తాను గురువుగారి యింటిలో ఉన్నప్పుడు తన తల్లిదండ్రులు వచ్చినా ఆయన అనుమతి లేకుండా వారికి నమస్కారం చేయకూడదు. విద్యాతపోధనులయందును, తనకంటె పెద్దవారియందును, గురుపుత్రులు బంధువులయందును, తన బంధువులయందును గురువునందు వలె నడుచుకోవాలి. గురుశిష్యుడు, వేదాధ్యయనం చేయించగల గురుపుత్రుడు,ఋత్విజుడు గురువులాగానే సన్మానానికి అర్హులు. సజాతీయ విజాతీయ గురుపత్నులకు గూడా ఎదురేగి నమస్కరించవచ్చును. జవరాలైన గురుపత్నికి ఇరవై సంవత్సరాల వయసు మించిన శిష్యుడు కాళ్లు పట్టుకొని అభివాదం చేయ కూడదు. ప్రపంచంలో స్త్రీ పురుషులను ఆకర్షించి మోహింప జేయటం సహజం. అందువలన విద్వాంసులు స్త్రీల విషయంలో ఏమరుపాటుగా ఉండరాదు. విద్వాంసుడైనా, అవిద్వాంసుడైనా పురుషుడు కామక్రోధవశుడై స్త్రీలకు లొంగిపోయి వారి చేడుమార్గంలోకి యీడ్వబడుతాడు.

**మాత్రా స్వస్రా దుహిత్రా వా న వివిక్తాసనో భవేత్ ।**
**బలవానింద్రియగ్రామో విద్వాంసమపి కర్షతి ॥**

ఇంద్రియములు అత్యంత బలమైనవి. ఎంతటి వివేకినైనా పరవశం చేస్తాయి. అందువలన తల్లితో గాని, అక్కచెల్లెళ్లతో గాని, కూతుళ్లతోనైనా ఒంటరిగా కూర్చుండకూడదు.

పెద్దవారైన గురుపత్నులకు ప్రతిదినము కుడిచేతితో కుడికాలును, ఎడమ చేతితో ఎడమకాలును పట్టుకొని అభివాదనం చెయ్యాలి. ప్రాయంలో ఉన్న శిష్యుడు జవరాండ్రైన గురుపత్నులకు పాదములు తాకకుండా భూమి నంటి అభివాదం చెయ్యాలి.

బ్రహ్మచారి బోడితలతోగాని, జటలతోగాని, శిఖాజటలతోగాని ఉండాలి. సూర్యోదయాత్పూర్వం మేలుకోవాలి. అస్తమయానంతరం నిదురించాలి. మైమరచి నిదురిస్తున్నప్పుడు సూర్యుడుదయిస్తే గాయత్రీజపం చేసి పగలంతా ఉపవాసం ఉండి రాత్రి భుజించాలి. నిదురిస్తున్నప్పుడు సూర్యుడస్తమిస్తే మరునాడు జపమూ, ఉపవాసమూ చేయాలి. తగిన ప్రాయశ్చిత్తం చేయకపోతే అతడు మహాపాతకుడవుతాడు.

## మనుస్మృతిలో 'బ్రహ్మచారి నియమాలు'

- బ్రహ్మచారి, బ్రహ్మచారిణి 'మద్యం, మాంసం, గంధం, పుష్పహారం, రసాలు, స్త్రీలు పురుషుల పరస్పర సాంగత్యం, పుల్లని పదార్థాలు, ప్రాణిహింస' అనే వీటిని విసర్జించాలి.
- శరీర మర్దనం, కారణం లేకుండా ఉపస్థేంద్రియాన్ని తాకుట; కన్నులకు కాటుక పెట్టుట; పాదరక్షలు, ఛత్రం ధరించుట; మరియు కామం, క్రోధం, లోభం, మోహం, భయం, శోకం, ఈర్ష్య, ద్వేషం, నృత్యం, గానం, వాద్యవాదనాలు మొ॥ వాటిని వీడాలి.
- జూదమాడటం, పరుల గురించి చర్చించటం, నిందించటం, అసత్యమాడటం, స్త్రీదర్శనం, ఆశ్రయం, ఇతరులకు సదా హాని కలిగించే దుష్కార్యాలు మొదలైనవాటిని వీడాలి.

# గురుసేవ

తల్లిదండ్రులను సేవించినట్లే ఆచార్యులను, గురువులను కూడ సేవించుట పరమకర్తవ్యము, మిక్కిలి అవసరము. ఋషికులము, గురుకులము, పాఠశాల, విద్యాలయము, మహావిద్యాలయము, విశ్వవిద్యాలయము మొదలగువాటియందు విద్యను అభ్యసించెడి విద్యార్థులు తమ ఆచార్యులను, ఉపాధ్యాయులను, ప్రొఫెసర్లను, ప్రాధ్యాపకులను మొదలగు గురుజనములను సత్కరించవలెను. వారి ఆజ్ఞలను పాటించవలెను. వర్ణాశ్రమములకు అనుగుణముగా వారికి శక్తికొలది సేవలు చేయవలెను.

ఇట్లే ఆత్మోద్ధరణ కొఱకు ఉపదేశించు గురువులను విశేషముగా పూజించి సేవించవలయును. అట్టి సద్గురువును సేవించుట వలన జ్ఞానప్రాప్తికలిగి పరమశ్రేయస్సు చేకూరును. శ్రీకృష్ణుడు గీతయందిట్లు చెప్పెను.

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥** గీత. 4/34

నీవు తత్త్వమును దర్శించిన జ్ఞానుల కడ కేగి, ఆ జ్ఞానమును గ్రహింపుము. వారికి దండప్రణామములు ఆచరించుట వలనను, సేవలొనర్చుటవలనను, కపటము లేకుండ భక్తిశ్రద్ధలతో సముచిత రీతిలో ప్రశ్నించుట వలనను పరమాత్మ తత్త్వమును చక్కగా నెరిగిన జ్ఞానులు సంప్రీతులై నీకు ఆ పరమాత్మతత్త్వజ్ఞానమును ఉపదేశించెదరు.

ఉపనిషత్తులలో కూడ గురుభక్తులకు చెందిన అనేక కథలు ఉన్నవి. సత్యకాముడు, ఉపకోసలుడు మొదలగువారు గురువులకు సేవచేసియే పరమాత్మ యొక్క యథార్థ జ్ఞానమును పొందిరి. పద్మపురాణములో భూమిఖండమునందు గురుభక్తి మహిమను గురించిన ఒక ప్రసంగముకలదు. అందులో ఇట్లు చెప్పబడినది. గురువు అనుగ్రహమువలన శిష్యునకు లౌకిక ఆచార

వ్యవహారములు తెలియవచ్చును. జ్ఞానప్రాప్తియు కలుగును. అతడు మోక్షమును కూడ పొందును. సూర్యుడు బాహ్యజగత్తును ప్రకాశింపచేయునట్లు గురువు శిష్యునకు ఉత్తమమైన బుద్ధిని ప్రసాదించి అతని అంతర్జగత్తును ప్రకాశింప చేయును. శిష్యునియొక్క అజ్ఞానముతో కూడిన అంధకారమును నశింపచేయును. కనుక శిష్యులకు గురువే అన్నిటికంటే గొప్ప తీర్థస్థలము. అన్నివిధముల గురువును ప్రసన్నముగా నుంచుట శిష్యుని ప్రథమకర్తవ్యము. గురువును, పుణ్యపురుషులను తలంచి మనస్సుతో, వాక్కుతో, శరీరముతో ఆ మహాత్ములను సేవించవలయును.

కనుక ఎప్పుడును గురువుగారితో చెడుగా వ్యవహరింపరాదు. ముఖ్యముగా ఆయన ఆజ్ఞలను పాలించవలయును. ఆయన కోరికలకు అనుగుణముగా పనులు చేయవలెను. ఆయన కోరికలు తెలియనిచో ఆయన సూచనలను పాటించవలెను. సూచనలు కూడ తెలియనిచో ఆయన ఆజ్ఞలను పాటించవలయును. మనోవాక్కాయములచేత సదా, సర్వదా వారి సేవయందు తత్పరులు కావలయును. ఈ విధముగా నిత్యము నమస్కరించుట, సేవించుట, ఆజ్ఞలను పాలించుటవలన శిష్యునకు శుభము కలుగును.

తల్లిదండ్రుల, గురువులసేవ యొక్క మాహాత్మ్యము ఎంతచెప్పినను అది తక్కువయే యగును. భగవద్గీతయొక్క 17వ అధ్యాయమునందలి 14వ శ్లోకములో శరీరసంబంధమైన తపస్సును వర్ణించుచు శ్రీకృష్ణుడు **"దేవద్విజ గురుప్రాజ్ఞ పూజనమ్"** అని చెప్పెను. అనగా దేవతలను, బ్రాహ్మణులను, గురువులను అనగా తల్లిదండ్రులను, ఆచార్యులను అట్లే జ్ఞానులు మొదలగు వారిని పూజించవలయును. సేవించి, సత్కరించి గౌరవించవలయును. మనువు ఇట్లు చెప్పుచున్నాడు.

**త ఏవ హి త్రయో లోకా స్త ఏవ త్రయ ఆశ్రమాః ।**

**త ఏవ హి త్రయో వేదా స్త ఏవోక్తా స్త్రయోఽగ్నయః ॥**

మను. 2. 230

**త్రిష్వప్రమాద్యన్నేతేషు త్రీన్లోకాన్ విజయేద్గృహీ ।**

**సవ్యేన సవ్యః స్ప్రష్టవ్యో దక్షిణేన చ దక్షిణః ॥** మను. 2. 232

తల్లి, తండ్రి, ఆచార్యులు ఈ ముగ్గురు భూః, భువః, స్వః లోకములు. ఈ ముగ్గురే బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ ఆశ్రమములు. వీరే ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదమున్నూ, వీరే గార్హపత్యము, దక్షిణాగ్ని, ఆహవనీయ అగ్ని అనబడుదురు. ఈ ముగ్గురిని జాగరూకతతో సేవించిన గృహస్థుడైన మనుజుడు మూడు లోకములను జయించును.

**త్రిష్వేతేష్వితి కృత్యం హి పురుషస్య సమాప్యతే ।**

**ఏష ధర్మః పరస్సాక్షాదుపధర్మోఽన్య ఉచ్యతే॥** మను. 2. 237

తల్లి, తండ్రి, గురువు ఈ ముగ్గురి సేవ చేయుటవలన పురుషునకు అన్ని కర్తవ్యములు నిర్వహించినట్లగును. అతనికి ఇంకేమియు చేయవలసినవి మిగిలియుండవు. ఇదియే సాక్షాత్తు పరమధర్మము. ఇది తప్ప మిగిలినవన్నియు ఉపధర్మములని చెప్పబడును.

తైత్తిరీయోపనిషత్తు (1/11) నందు ఇట్లు చెప్పబడినది.

**మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ**

అనగా తల్లిని దైవసమానముగా భావించవలెను. తండ్రిని భగవంతుడని తెలుసుకొన వలెను. ఆచార్యుని దైవముగా తలంపవలెను. వీరందరిని పరమాత్మకు ప్రతినిధులుగా భావించవలెను.



# ఆదర్శ ఆచార్యుడు

## ఆచార్యుని లక్షణం:

"ఆచార్యః పూర్వరూపమ్ । అన్తేవాస్యుత్తరరూపమ్ ।
విద్యా సన్ధిః । ప్రవచనం సంధానమ్ । ఇత్యధివిద్యమ్ ॥

తైత్తిరీయ ఉప. 1-3-5

**అర్థం:** అధివిద్య అనగా విద్యకు సంబంధించినంతవరకు గురువుకు ప్రథమస్థానం. అన్తేవాసికి (శిష్యునికి) ద్వితీయస్థానం. ఈ ఇద్దరు కలియగానే స్వతఃసిద్ధంగా విద్య జనిస్తుంది. జ్ఞానజన్మనిచ్చే గౌరవం ఆచార్యుని ప్రవచనానికుంది.

తైత్తిరీయోపనిషత్కర్తయైన ఋషి విద్యాసంహితను ఇలా వివరించాడు.

ఆచార్యుడు పూర్వరూపం, అన్తేవాసి (శిష్యుడు) ఉత్తరరూపం. వీరిద్దరు కలవడమే విద్య. రెండు తత్త్వాలు కలవడమే సంధి. సంధి ఏవిధంగానైనా కావచ్చు. విద్యార్థి పూర్వరూపమైనా ఆచార్యుడు ఉత్తరరూపమైనా సంధి అగుటకు వీలుంది. కానీ అలా జరిగితే విద్యాసంధిరూపం దూషితమవుతుంది. కావున తైత్తిరీయఉపనిషత్తుకు సంబంధించిన ఋషి ఆచార్యునికి ప్రథమస్థానాన్ని ఇచ్చాడు.

"ఆచార్యునికి రెండు రూపాలున్నాయి. ఒకటి మృత్యురూపం, మరొకటి అమృతరూపం. ఒకటి వజ్రం కంటె కఠోరమైనది. మరొకటి కుసుమం కంటె మృదువైనది.

అథర్వవేదంలో (11-5-14) గల బ్రహ్మచర్య సూక్తంలో ఆచార్య స్వరూపం ఇలా వర్ణింపబడింది.

**"ఆచార్యో మృత్యుర్వరుణః సోమ ఓషధయః పయః"**

**జీమూతా ఆసన్త్సత్వానస్తైరిదం స్వరాభృతమ్ ॥** అథ.11-5-14

## ఆచార్యునికి ఐదు రూపాలు

1. ఆచార్యుడు మృత్యువు 2. ఆచార్యుడు వరుణుడు
3. ఆచార్యుడు సోముడు 4. ఆచార్యుడు ఓషధి
5. ఆచార్యుడు పయః

ఆచార్యునికున్న ఈ ఐదు రూపాలలో మృత్యురూపం, వరుణ రూపాలు వజ్రం కంటె కఠోరమైనవి. మిగిలిన మూడు సోమ, ఓషధి, పయః రూపాలు కుసుమం కంటె మృదువైనవి. మొదటి రెండు రూపాలు రుద్రరూపాలు కాగా మిగిలిన మూడు రూపాలు సౌమ్య రూపాలు. ఆచార్యుడు శిష్యులలో కొందరికి రౌద్రరూపం అంటే మృత్యు వరుణ రూపాలను చూపించి పాశబద్ధులను చేయగలడు. మరికొందరికి సోమ, ఓధి, పయః రూపాలను చూపించి వాత్సల్యధారలతో ముంచివేయగలడు. వీటియొక్క విస్తృతరూపమే ఋగ్యజుస్సామాలు. జ్ఞానకర్మోపాసనలు. భూః, భువః, స్వః. అకార, ఉకార, మకార రూపమైన త్రివిధ రసానుభూతులు.

ఆఙ్ పూర్వక **"చర-గతి భక్షణయోః"** అను ధాతువునుండి ఆచార్య శబ్దం ఏర్పడుతుంది.

**"యః ఆచారం గ్రాహయతి సర్వాః విద్యాః బోధయతి స ఆచార్యః"**

సత్యమైన ఆచారాన్ని నేర్పుతూ, సర్వవిద్యలను బోధించేవాడు ఆచార్యుడు.

యాస్కమహర్షి స్వరచిత విరుక్తమనే గ్రంథంలో ఆచార్యులెవరని ప్రశ్నించి, సమాధానం కూడా వ్రాశారు.

**"ఆచార్యః కస్మాత్? ఆచారం గ్రాహయత్యాచినోత్యర్థాన్**

**ఆచినోతి బుద్ధిమితివా ।** నిరుక్తం పూ. 6.1, పా. 2, ఖండం 2

స్వయంగా సర్వవిద్యార్థసంపన్నుడై శిష్యులకు అత్యుత్తమమైన ఆచారాన్ని (ఆచరణను) నేర్పి, సర్వార్థసంపన్నులను చేసేవాడే ఆచార్యుడు. అంటే సర్వవిద్యలను అర్థసహితంగా చదివించి ధనాదులతో అర్థయుక్తునిగా చేస్తాడు. బుద్ధిని వృద్ధిచేసి మానవుని మహాబుద్ధిమంతునిగా మార్చగలడు. అందువల్లనే సర్వశాస్త్రాలు సర్వోత్తముడైన అధ్యాపకున్ని ఆచార్య పదంతో పిలుస్తున్నవి.

## ఆచార్యుని గొప్పతనం

**"ఆచినోతి హి శాస్త్రార్థం ఆచారే స్థాపయత్యపి ।**
**స్వయమాచరతే యస్మాదాచార్యః పరికీర్త్యతే ॥**

శిష్యులకు శాస్త్రాల యొక్క అర్థజ్ఞానాన్ని కలిగించి, సదాచారమునందు స్థిరపరుస్తూ వాటిని స్వయంగా ఆచరించువాడు ఆచార్యుడుగా పిలువబడతాడు.

**"అగ్నిహోత్రీ తపస్వీ చ వేదమధ్యాపయేచ్చ యః ।**
**సకల్పం సరహస్యం చ తమాచార్యం ప్రచక్షతే ॥**

అగ్నిహోత్రం చేయువాడు, వేదం చదివించువాడు కల్పం (వేదాంగం)తోపాటు రహస్యార్థసహితంగా శాస్త్రాలు నేర్పేవాడు ఆచార్యుడు.

**"ఉపనీయ తు యః శిష్యం వేదమధ్యాపయేత్ ద్విజః**
**సకల్పం సరహస్యం చ తమాచార్యం ప్రచక్షతే ॥**మను. 2.140

శిష్యునికి ఉపనయన సంస్కారం చేసి కల్పసూత్ర సహితంగా వేదవిద్యలు చదివించేవాడే ఆచార్యుడు.

**"స్వయమాచరతే యస్మాద్ ఆచారే స్థాపయత్యపి ।**
**ఆచినోతి చ శాస్త్రార్థాన్ యమైః సహ నియమైః సహ ॥**

స్వయంగా ఆచారవంతుడై ఇతరులకు కూడా ఆచారాలు నేర్పి ఆచారవంతులను చేస్తూ, యమనియమాది అష్టాంగాలను తెలియపరిచి బోధించేవాడే ఆచార్యుడు

**అమ్నాయ తత్త్వవిజ్ఞానాచ్చరాచర సమానతః ।**
**యమాదియోగ సద్ధిత్వాదాచార్య ఇతి కథ్యతే ॥**

వేదతత్త్వవిజ్ఞానవేత్తయై చరాచరజగత్తులో సమానభావం కలవాడై యమనియమాది యోగాంగాలలో సిద్ధిని పొందినవానికి ఆచార్యుడని పేరు.

**"యస్మాద్ధర్మానాచినోతి స ఆచార్యః"**ఆపస్తంబీయ సూ. 1,ప। ఖం।

ధర్మాలను చయనం చేస్తున్నందువలన అతనికి "ఆచార్యు"డని పేరు. "శ్రేష్ఠమైన ఆచారాలను ఆచరిస్తూ విద్యార్థులకు సర్వవిద్యలను నేర్పేవాడే "ఆచార్యుడు".

"స్వమన్తవ్యామన్తవ్య ప్రకాశములో..."

1. వేదాలు నాలుగు:-ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణవేదం.
2. వేదాంగాలు:- శిక్ష, వ్యాకరణం, జ్యోతిషం, కల్పం, ఛందస్సు, నిరుక్తం.
3. ఉపాంగాలు - దర్శనాలు:- సాంఖ్యదర్శనం, యోగదర్శనం న్యాయదర్శనం, వైశేషికదర్శనం. పూర్వమీమాంస, ఉత్తరమీమాంస.

విద్యార్థులతో త్రికరణశుద్ధిగా అత్యంతప్రేమతో, ధర్మయుక్తంగా వ్యవహరిస్తూ, ధర్మాచరణం నేర్పుతూ విద్యను బోధించువాడే ఆచార్యుడు.

సంస్కారవిధిలో ఉపనయన సంస్కార సందర్భంలో ఆచార్య శబ్దానికి టిప్పణినిస్తూ మహర్షి దయానందులవారు ఇలా వ్రాశారు. వేదాల యొక్క వేదాంగాల యొక్క ఉపాంగాల యొక్క శబ్దార్థ సంబంధ జ్ఞానం తెలిసినవాడు, ఛలకపటం లేకుండా, మిక్కిలిప్రేమతో అందరికీ విద్యాదానం చేయువాడు పరోపకారపరాయణుడు, త్రికరణాలతో సర్వసుఖాభివృద్ధి తత్పరుడు, మహాశయ సంపన్నుడు, పక్షపాతరహితుడు, సత్యోపదేష్ట, సర్వహితైషి, ధర్మాత్ముడు, జితేంద్రియుడు మొదలగు లక్షణాలు కలవాడు 'ఆచార్యుడు'.

## ఆచార్య ప్రశంస

వైదిక శాస్త్రాలు, మనుస్మృతి, వాల్మీకి రామాయణం, మహాభారతం, శతపథబ్రాహ్మణం, విష్ణుస్మృతి మొ॥ గ్రంథాలన్నీ ఆచార్య గౌరవాన్ని ఎంతగానో ప్రశంసించినవి. **"ఉపాధ్యాయాన్దశాచార్యః"** ఉపాధ్యాయునికంటె ఆచార్యుడు పదిరెట్లు ఎక్కువగా గౌరవనీయుడు అని మనుమహర్షి (మను. 2-145) అంటున్నారు.

**"మాతృమాన్ పితృమాన్ ఆచార్యవాన్ పురుషో వేద"**

శత పథ బ్రాహ్మణం: 14-5-8-2

వాస్తవంగా ఉత్తమ శిక్షకులు ముగ్గురే. తల్లి, తండ్రి, ఆచార్యుడు. ఇలాంటి శిక్షకులు లభించినప్పుడు మనిషి జ్ఞానవంతుడవుతాడు.

(సత్యార్థ ప్రకాశం. ద్వితీయ సముల్లాసం)

తల్లి-తండ్రి తరువాత మూడవస్థానం ఆచార్యునికిచ్చారు. ఈ విషయంలో మహర్షి వశిష్ఠుడు శ్రీరామచంద్రునికి విశేషమైన ఉపదేశాన్ని చేశాడు.

**"పితా హ్యేనం జనయతి పురుషం పురుషర్షభ ।**

**ప్రజ్ఞాం దదాతి చాచార్యః తస్మాత్తం గురురుచ్యతే ॥**

వా.రా.అయో.సర్గ 111

పుత్రునికి జన్మనిచ్చేవాడు తండ్రి. బుద్ధిని పెంచేవాడు ఆచార్యుడు. అంటే ఆచార్యుడు శిష్యునికి సత్యాసత్య పదార్థాల జ్ఞానాన్ని బోధిస్తాడు. అందువల్లనే ఆచార్యున్నే గురువంటారు.

ఈ విషయం మనుస్మృతిలో ఇలా చెప్పబడింది.

**"అల్పం వా బహు వా యస్య శ్రుతస్యోపకరోతి యః ॥**

**తమపీహ గురుం విద్యాచ్ఛ్రుతోపక్రియయా తయా॥** మను. 1.149

చదువుచెవ్పడంలో ఎక్కువగాగానీ లేక స్వల్పంగాగానీ సహాయపడినవానికి "గురు"వని పేరు. దీన్నిబట్టి మానవునికి అనేకమంది గురువులు ఉండొచ్చు. కానీ **'గౌణముఖ్యయోర్ముఖ్యకార్యసంప్రత్యయః** (ముఖ్యమైనవారు, మామూలు వారున్నప్పుడు ముఖ్యులనే స్వీకరించాలి) అను న్యాయాన్నిబట్టి **"త్రయః పురుషస్యాతి గురవోభవన్తి, మాతా, పితా, ఆచార్యశ్చ"**

విష్ణుస్మృతి. 6-31-1-2

మనిషికి తల్లి, తండ్రి, ఆచార్యుడు ఈ ముగ్గురే ముఖ్యమైన గురువులు. కానీ వేదాది విద్యలను బోధించుటలో తల్లిదండ్రుల కంటే ఆచార్యుడే ముఖ్యుడు. మనుస్మృతిలో (2-146) వ్రాసినట్లుగా **"ఉత్పాదక బ్రహ్మదాత్రోర్గరీయాన్ బ్రహ్మదః పితా"** వేదజ్ఞానప్రదాత అయిన ఆచార్యుడు కన్నతండ్రి కంటే అధికుడు.

పిల్లలకు కన్నతండ్రికంటే విద్యలు నేర్పే ఆచార్యుడే ముఖ్యుడు. శుక్రనీతి 1వ అధ్యాయంలోనూ ఇదే అభిప్రాయం తెలుపబడింది.

"హితోపదేష్టా శిష్యస్య సువిద్యాధ్యాపకో గురుః"

శిష్యునికి విద్యాభ్యాసాది సదుపదేశాలనిచ్చి ఇహ-పర మార్గాలను చూపేవాడే ముఖ్యమైన గురువు.

## బ్రహ్మాచారి - ఉపనయనం

ఉపనయనం అంటే ఉప = సమీపానికి, నయనం - తీసుకొనిపోవుట. విద్యాధ్యయనానికి గురువువద్దకుగానీ, లేక ఆచార్యునివద్దకుగానీ విద్యార్థిని తీసుకొనిపోవుట అని అర్థం. అథర్వ వేదంలో ఇలా చెప్పబడింది.

1. **ఆచార్యః ఉపనయమానో బ్రహ్మాచారిణం కృణుతే గర్భమన్తః ।**
**తం రాత్రీస్తిస్ర ఉదరే బిభర్తి తం జాతం ద్రష్టుమభిసంయన్తి దేవాః ।**

**అథ.11.5.3**

అర్థం: ఆచార్యుడు ఉపనయనం చేస్తూ బ్రహ్మాచారిని తన గర్భంలో ధరిస్తాడు. అతనిని మూడురాత్రుల వరకు తన గర్భంలో (తన కులంలో) ఉంచుకొంటాడు. విద్యవలన ద్విజరూపంలో ఉత్పన్నమైన ఆ బ్రహ్మాచారిని దర్శించుటకు దేవతలు వస్తారు.

వేదాన్ని అనుసరిస్తూ మనుమహర్షి కూడా ఈ విధంగా అభిప్రాయపడ్డారు.

2. **"ఉపనీయతు యః శిష్యం వేదమధ్యాపయేద్ ద్విజః ।**
**సకల్పం సరహస్యం చ తమాచార్యం ప్రచక్షతే ॥** మను.2.140

అర్థం: ఏ ద్విజుడు శిష్యునికి ఉపనయన సంస్కారం చేసి వేదం చదివిస్తూ వేదాంగమైన కల్పం యొక్క రహస్యాలన్నింటిని బోధిస్తాడో అతనిని ఆచార్యుడంటారు. ఈ ఉపనయన సంస్కారం (క్రియ) ఆచార్యుని ద్వారానే

చేయబడుతుంది కనుక అతను ఆచార్యుడనబడతాడు.

3. గౌతమప్రణీత ధర్మశాస్త్రానుసారంగా 8వ సంవత్సరంలో బాలకునికి ఉపనయనం చేయాలి. ఆ ఉపనయన సంస్కారం వలన బాలకునికి ద్వితీయ జన్మ కలుగుతుంది. ఈ ద్వితీయ జన్మలో తల్లి గాయత్రి, తండ్రి ఆచార్యుడు.

4. ఆపస్తంబ గృహ్యసూత్రం (4-10-1)లో వ్రాసిన విషయం.

**"ఉపనయనం వ్యాఖ్యాస్యామః ॥**

**యేన ఆచార్యకులముపనీయతే కుమారః ॥**

**అర్థం:** ఏ కర్మ ద్వారా ఆచార్యుడు బ్రహ్మచారిని తన (ఆచార్య) కులానికి తీసుకొనిపోవునో ఆ కర్మకే **'ఉపనయనకర్మ'** అని పేరు.

ఆపస్తంభ గృహ్యసూత్రం (4-11-7)లో ఆచార్యునికి **'ఉపనేత'** అనే నామం ఉందని వ్రాశారు. ఉపనయనం చేస్తారు కనుక ఆయననే ఉపనేత అంటారు.

5. మానవగృహ్య సూత్రం (1-9-1) లో వ్రాసిన విషయం - ఉపనయనం చేసి వేదాన్ని చదివించువానికే ఆచార్యుడని పేరుంది. అలాంటి ఆచార్యునికి **"మధుపర్కం"** ద్వారా సన్మానం చేయాలి.

6. 'పాతంజలి కాలీనభారతం' అనే గ్రంథంలో - ఉపనయనం చేసినవానికి ఆచార్యుడని పేరు. అందువల్లనే ఉపనయనకర్మకు **"ఆచార్యకరణ"** మనీ నామాంతరముంది.

ఉపనయనానికి అర్థం ఉపనేత. మాణవకుని (విద్యార్థిని) ఏ పద్ధతిలో తనవద్దకు చేర్చుకొనునో, ఆ క్రియవల్లనే అతడు ఆచార్యుడవుతున్నాడు. అందువల్ల ఆయనకు ఉపనయమానుడని పేరు. ఆచార్యుడు, ఉపనయమానుడు అనునవి పర్యాయ పదాలు.

7. "పాణిని కాలీన భారతవర్షము" అనే పుస్తకంలో ఈ విషయాన్ని చాలా విపులంగా వర్ణించారు. వేదం చదివించే సమయం రాగానే ఆచార్యుడు మాణవకునికి (విద్యార్థికి) ఉపనయన సంస్కారం చేయిస్తాడు. అందువల్లనే **"మాణవకముపనయతే"** అను వాక్యం వ్రాయబడింది. ఈ విశేష కర్మకే **"ఆచార్యకరణ"** మంటారు. ఈ సంస్కారం తరువాత మాణవకుడు వాస్తవంగా ఆచార్యుని సామీప్యమును పొందుతాడు. మనసా-వాచా-కర్మణా ఆచార్యుని సమీపానికి రాగానే **'అన్తేవాసీ'** అనే పదవికి అర్హుడవుతాడు.

పాణిని ప్రకారం శిక్షకులు నాలుగు విధాలుగా ఉంటారు. 1.ఆచార్యుడు, 2.ప్రవక్త, 3.శ్రోత్రియుడు, 4.అధ్యాపకుడు. వీరిలో ఆచార్యుడు సర్వోన్నతుడు. శిష్యునికి ఉపనయనం చేసే అధికారం ఒక్క ఆచార్యునికే ఉంది. అథర్వణవేదం (11-5-3)లో ఆచార్యకరణ ప్రక్రియకు సంబంధించిన వివరణ కనబడుతుంది. **"ఆచార్య ఉపనయమానో కృణుతే గర్భమన్తః"** అని.

**1. ఆచార్యుడు:-** ఆచార్యుడు ఉపనయన సంస్కారం చేసి, బ్రహ్మచారిని తన గర్భంలో అంటే తన సంరక్షణలో ఉంచుకుంటాడు. ఇలాంటి ఉదాత్తకల్పనను బట్టి బ్రహ్మచారి **'అన్తేవాసి'** అని పిలువబడతాడు. తల్లి గర్భంలో శిశువుకు పోషణ లభించినట్లుగానే **'అన్తేవాసి'** (విద్యార్థి) ఆచార్యుని విద్యాగర్భంలో సర్వవిధాలా ఆధ్యాత్మిక పోషణను పొందుతాడు.

## ఆచార్యునికి - శిష్యునికి గల సంబంధం

వీరిద్దరికున్న సంబంధం చాలా సన్నిహితమైనది, గొప్పనైనది, పవిత్రమైనది. శిష్యుడు ఆచార్యుని పేరుతో పిలువబడేవరకు ఇది సాగుతుంది. "ఆచార్యో ప్రసర్జనశ్చాన్తే వాసీ" అను పాణిని సూత్రాన్ననుసరించి (6-12-126, 6-2-104) గురువు పేరుతోనే కొంచెం మార్పుతో శిష్యుడు

పిలువబడతాడు. ఉదాహరణకు: తిత్తిరి అనే గురువు యొక్క శిష్యునికి - తైత్తిరీయుడు అని, అపిశిలుని శిష్యునికి ఆపిశిలుడని, పాణిని శిష్యునికి పాణినీయుడని పేర్లున్నవి.

**2. ప్రవక్త:-** ఆచార్యుని తరువాత ద్వితీయస్థానమందుండువారు ప్రవక్త. ప్రోక్త సాహిత్యాన్ని (అనగా శాఖాగ్రంథాలు, బ్రాహ్మణాలు, సూత్రాలు మొదలైనవి) ప్రవచనం చేయువాడు, బోధించువాడు ప్రవక్త. వీరికే ఆఖ్యాత అని కూడా పేరున్నది. వేదాలను, వేదాంగాలను బోధించడం వీరి పని. ప్రవక్త, శ్రోత్రియుడు, అధ్యాపకుడు - వీరు క్రమాన్ననుసరించి గొప్పవారని చెప్పబడింది.

**3. శ్రోత్రియుడు:-** వేదాలను మరియు వేదశాఖలను కంఠస్థం చేసే, చేయించే విద్వాంసునికి శ్రోత్రియుడని పేరు. 'శ్రోత్రియశ్ఛన్దోఽధీతే' నిరు. 5-2-84). సూత్రాన్నిబట్టి వేదపారాయణం చేయడం చేయించడమే శ్రోత్రియుని ముఖ్య కర్తవ్యం. వారు సంహిత, పద, క్రమ, దణ్డ, జటా, ఘన మొదలైన పాఠాలను స్వయంగా కంఠస్థం చేయడమేగాక విద్యార్థులచేత కంఠస్థం చేయిస్తారు. వీరి ఆధీనంలో వుంటూ, పదపాఠం కంఠస్థం చేసిన విద్యార్థులు 'పదకులు' అనబడతారు. ఇదేవిధంగా క్రమపాఠాన్ని కంఠస్థం చేసినవారికి 'క్రమకులు' అని పేరు. 'క్రమాదిభ్యోవున్' సూత్రం ద్వారా క్రమక శబ్దం ఏర్పడుతుంది. శ్రోత్రియ గురువులకు కూడా వారు కంఠస్థం చేసిన వేదపాఠాన్ని అనుసరించి పేర్లు కలుగును. గురుకులాలలో భిన్న భిన్న పాఠాలను కంఠస్థం చేయించుటకు భిన్నభిన్న గురువులు ఉండేవారు. కొందరు శ్రోత్రియులు పదకులైతే, మరికొందరు క్రమకులు. ఏవిధమైన పారాయణాన్ని చేయిస్తారో దాని ననుసరించి వారు పిలువబడుతారు.

**4. అధ్యాపకుడు:-** బాల విద్యార్థులకు పాణినీయం గానీ, పాణిన్యధికృత గ్రంథంలో పేర్కొనబడిన సాహిత్యానికి సంబంధించిన లౌకిక సాహిత్యాన్ని

గానీ, విజ్ఞాన సాహిత్యాన్నిగానీ బోధించే గురువుకు "అధ్యాపకుడని పేరు". పతంజలి భాష్యం వీరినే 'ఖండకోపాధ్యాయులనే' పేరుతో పిలుస్తుంది.

**సత్యార్థ ప్రకాశం:** మూడవ సముల్లాసంలో మహర్షి దయానందులవారు ఇలా వ్రాశారు. ద్విజులు తమ గృహాలలోనే బాలురకు, బాలికలకు యజ్ఞోపవీత సంస్కారం చేసి, వారిని ప్రత్యేకించిన ఆచార్యకులాలకు పంపించాలి. బాలురని బాలుర గురుకులాలకు, బాలికలను బాలికల గురుకులాలకు పంపించాలి.

## బాలునికి ద్వితీయ జన్మ

ఉపనయనం తరువాత బాలుడు ద్విజుడనబడతాడు. ద్విజ శబ్దానికి 'రెండవ జన్మ కలిగినవాడని అర్థం. తల్లిదండ్రుల ద్వారా కలుగునది ప్రథమ జన్మ. గురుకులంలో ప్రవేశించినప్పుడు ఆచార్యుని ద్వారా కలుగునది ద్వితీయ జన్మ". **"జన్మనా జాయతే శూద్రః, సంస్కారాద్ ద్విజ ఉచ్యతే"** (మహాభారతం) జన్మతో అందరూ శూద్రులే. సంస్కారం ద్వారానే మనిషి "ద్విజు"డవుతున్నాడు.

రాజకుమారుడైనా, దరిద్రుని సంతానమైనా జన్మతో శూద్రులే అవుతారు. రాజకుమారుని తల్లైనా, బీదవాని తల్లైనా పాకీపని చేయాల్సిందే. అంటే పిల్లవాళ్ళకు మల మూత్రాలు కడిగి శుభ్రం చేయక తప్పదుగదా. ఈ పరిశుభ్ర కార్యాన్నే సంస్కారమంటారు. అదేవిధంగా ఆచార్యవర్యులైన మహర్షి దయానందులవారు 'సంస్కారవిధి' అనే గ్రంథాన్ని వ్రాసి బాలబాలికల నవనిర్మాణార్థం ఒక నూతన మార్గాన్ని సూచించారు. వారు రచించిన అమరగ్రంథమైన "సత్యార్థ ప్రకాశం" తృతీయ సముల్లాసంలో ఈ విధంగా వ్రాసారు. గురుకులంలో ప్రవేశించిన విద్యార్థులందరికీ సమానంగా వస్త్రాలు, భోజనం, ఆసనాలు ఇవ్వాలి. అక్కడ తారతమ్యం చూపించరాదు. రాజకుటుంబం నుండి వచ్చిన బాలుడైనా, లేక దరిద్రకుటుంబం నుంచి వచ్చిన బాలుడైనా

అందరిని సమానంగా చూడాలి. అందరికీ ఒకే రకమైన వస్త్రాలు, భోజనం, ఉండాలి. అందరూ తపఃసంపన్నులు కావాలి. "**కన్యానాం సంప్రదానం చ కుమారాణాం చ రక్షణమ్**" మను. 7.152. ఇది మనుమహర్షి వచనం.

"ఐదవ సంవత్సరంగానీ, ఎనిమిదవ సంవత్సరంగానీ గృహస్థులు తమ బాలబాలికలను గృహమందుంచకుండా గురుకుల పాఠశాలలకు పంపించాలి. అలా పంపించని తల్లిదండ్రులు శిక్షార్హులగుదురనే రాజశాసనం ఉండాలి.

మహర్షి దయానందులవారు దూరదృష్టి కలవారు. ప్రపంచ భాగ్య నిర్మాతలు. వారు సూచించిన కళ్యాణమార్గాన్ని అనుసరించకపోవుట వల్లనే ప్రజలు దుఃఖాలపాలవుతున్నారు. విశ్వంలో ఉన్న విభిన్న పార్టీలు - అది లార్డ్ మెకాలే విద్యావిధానం కావచ్చు లేక కాంగ్రెస్ వారి విద్యాపద్ధతి కావచ్చు లేక భారతీయ జనతాపార్టీ వారి ప్రణాళిక కావచ్చు. లేక విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ సూచించిన మండల ఆయోగ్ విధానం కావచ్చు. ఏదైనా సరే మానవ నిర్మాణంలో వీరి దృష్టికోణం చాలా సంకుచితమైందే. చూడండి! వేదాల ఆధారంగా మనుమహర్షి ద్వారా చెప్పబడిన, మహర్షి దయానందులవారి ద్వారా నిర్దిష్టమైన మార్గం ఆదర్శ విద్యామార్గం. దీనిననుసరించే విశ్వంలో నవనిర్మాణం జరగాలి. అందుకు తగిన సంస్కరణలు ఆచరణలోకి రావాలి. అప్పుడే అందరికీ మేలు కలుగుతుంది.

## రెండు జన్మలు అంటే?

వ్యక్తికి ప్రథమ జన్మ తల్లి గర్భం నుండి, రెండవ జన్మ సావిత్రీ తల్లిగర్భం నుండి కలుగుతుంది. తల్లి గర్భం నుండి జన్మించు విషయం తప్ప మానవునికి మరో జన్మ ఉంటుందనే విషయం సామాన్యులకు తెలియదు. ద్వితీయ జన్మ రహస్యం తెలిసినవానికి యజ్ఞోపవీతం, దానికుండే త్రిసూత్రాలు, ఒక్కొక్క

సూత్రంలో మూడు దారాలు, దానికి వేసే బ్రహ్మగ్రంధి (ముడి) యొక్క రహస్యాలన్నీ తెలియగలవు.

## ద్విజశబ్ద ప్రయోగం:

మానవునికి రెండవ జన్మ ఉన్నదనే విషయం నిరూపించుటకు ఎక్కువగా ఆలోచించవలసిన పనిలేదు. **'ద్విజ'** శబ్దమే రెండు జన్మలను సూచిస్తుంది. శరీరంలోనే రెండవ జన్మ కలుగుతుందనే జ్ఞానం ప్రజలకు తెలియడంలేదు. **"ద్వాభ్యాం జాయత ఇతి ద్విజః"** రెండు యోనుల నుండి జన్మించుటవలన ద్విజుడవుతాడు. ఒక జన్మ మాతృయోని నుండి రెండవ జన్మ ఆచార్యకులము నుండి పొంది ద్విజుడవుతాడు. వీరు బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్య శబ్దవాచ్యులగుచున్నారు.

ఆచార్య కులము నుండి పొందిన జన్మయే ఉత్కృష్టమైంది. ప్రముఖమైంది కూడా. ఈ జన్మలేనిచో మాతృయోని జన్మ సాధారణ జన్మయే అవుతుంది. సాధారణ జన్మచేత మానవులందరు శూద్రులే (అజ్ఞులే). చదివించినా చదవనివాడు, చదువురానివాడు ఈ ఇద్దరూ శూద్రులే. ఏకజుడు ద్విజుడు కాలేదు.

## శరీరజన్మ, విద్యాజన్మల మధ్య భేదం

తల్లిదండ్రుల వలన కలిగే జన్మ కేవలం శరీరం మాత్రమే. ఆచార్యుని విద్య ద్వారా కలిగే జన్మ ఉత్కృష్టమైంది. వేదాలు, మనుస్మృతి, రామాయణ మహాభారతాలలో, ఆపస్తంబ సూత్రాలలో ఆచార్యుని వలన కలిగే విద్యాజన్మ ప్రముఖమైందిగా ప్రశంసింపబడింది.

**కామాన్మాతా పితాచైనం యదుత్పాదయతో మిథః ।**

**సంభూతిం తస్య తాం విద్యాద్యద్యో నావభిజాయతే ॥**

మను. 2-122

అర్థం: తల్లిదండ్రులు బాలకులకు ఉత్పత్తి కారకులవుతారు. సంతానప్రాప్తి కామనయే దీనికి ముఖ్యం. ప్రపంచంలో ప్రకటమగుటయే దీని ప్రయోజనం. ఆచార్యుడు బాలకునికి ఉపనయనం ద్వారా దీక్షితుని చేసి శిక్షారూపంలో నిజమైన జన్మను ఇస్తాడు. ఈ విద్యాజన్మను పొందిన తరువాతనే మానవుడు నిజంగా మానవుడవుతాడు.

**"ఆచార్యస్త్వస్య యాం జాతిం విధివద్వేదపారగః ।**

**ఉత్పాదయతి సావిత్ర్యా సా సత్యా సాఽజరామరా ॥"**

మను 2-123

**అర్థం:** వేదమర్మజ్ఞుడైన ఆచార్యుడు సావిత్రీ మొ॥ మంత్రాల ద్వారా తన శిష్యులకు బోధించి, ఏ వర్ణం నిశ్చయించునో ఆ వర్ణం మాత్రమే అజరామరమైనది.

**"శరీరమేతౌ సృజతః పితా మాతా చ భారత ! ।**

**ఆచార్యశాస్తా యా జాతిః సా సత్యా సాఽజరామరా ॥**

మహాభాష్యం 150

తల్లి తండ్రి కేవలం శరీరానికి జన్మనిస్తారు. కానీ ఆచార్యుడు చేసే ఉపదేశాల ద్వారా ఏ వర్ణం గుణకర్మస్వభావాల ద్వారా లభించునో ఆ వర్ణమే సత్యమైనది. అజరమైనది. అమరమైనది.

మహాభారతంలో ఉద్యోగ పర్వంలో (6-44) ఆచార్యుని గురించి ఇలా ఉంది.

"ఆచార్యయోనిమిహ యే ప్రవిశ్య భూత్వా గర్భం బ్రహ్మచర్యం చరన్తి।

ఇహైవ తే శాస్త్రకారా భవన్తి విహాయ దేహం పరమం యాన్తి యోగమ్॥

అర్థం: ఎవరైతే ఆచార్యునిలో ప్రవేశించి, బ్రహ్మచర్య రూపమైన గర్భాన్ని ధరిస్తారో వారే ఈ ప్రపంచంలో విద్వాంసులు, గ్రంథకారులవుతారు. ఈ శరీరాన్ని త్యజించిన తరువాత వారే ముక్తిని పొందుతారు.

ఇదేవిధంగా

"ఆచార్యః శాస్త్రాధిగమహేతూనామ్" చరక. సూ. 6-25-33

విద్యాధ్యయన సాధనాలలో - ముఖ్యసాధనం ఆచార్యుడే.

ఆపస్తంభ ధర్మసూత్రం (1-1-15-17)

**"అసౌ హి విద్యాతస్తం జనయతి తచ్ఛ్రేష్ఠం జన్మ**
**శరీరమేవ మాతాపితరౌ జనయతః॥**

అర్థం: విద్య ద్వారా ఆచార్యుడు బ్రహ్మచారికిచ్చే జన్మ శ్రేష్ఠమైంది. తల్లిదండ్రులు కేవలం శరీరజన్మనే ప్రసాదిస్తారు.

పైన పేర్కొనబడిన ఉదాహరణల ద్వారా "ఆచార్యుడిచ్చే వేదవిద్యా జన్మయే వాస్తవిక జన్మ" అనీ, అది సర్వశ్రేష్ఠమనీ స్పష్టమవుతున్నది.

**"ఆచార్య ఉపనయమానో బ్రహ్మచారిణం కృణుతే**
**గర్భమన్తస్తం రాత్రీస్తిస్ర ఉదరే బిభర్తి** అథ. 11-5-3

ఆచార్యుడు ఉపనయన సంస్కారం చేసి బ్రహ్మచారిని తన గర్భంనందు ఉంచుకొంటాడు. మూడురాత్రులు అనగా 36 సంవత్సరాల కాలం ఆచార్యుడు బ్రహ్మచారిని తన గర్భమునందు ఉంచుకొంటాడు. 36 సంవత్సరాల తర్వాత ఆచార్యులవారు తనకు నూతన జన్మనిస్తాడు. అనగా స్నాతకుని చేస్తాడు. విద్యార్థులలో ప్రస్ఫుటంగా రాబోయే భావిగుణ బీజాలను ఆచార్యులవారు

తన సూక్ష్మబుద్ధితో గమనించి, ఆచార్యత్వానికి కావల్సిన గుణాచారాలతో శిక్షణనిస్తాడు. ఆచార్యుడు మెల్లమెల్లగా విద్యార్థిలో ఆచార్యశిక్షణసమర్థతను గుర్తించి, విద్యార్థికి తన బాధ్యతను అప్పగించి తాను సన్యాసాన్ని స్వీకరిస్తారు. ఈవిధంగా ఏ తల్లిదండ్రులు ఆచార్యునికి బాలకున్ని సమర్పిస్తారో, ఆ పిల్లలకు శిక్షణపద్ధతిననుసరించి, ఆ బాలునిలో వున్న అజ్ఞానాన్ని నశింపజేసి నూతనజన్మను అతడు ప్రసాదిస్తాడు.

నూతనంగా ప్రవేశించిన బాలురకు ఆచార్యులవారు మేఖలాధారణ (ముంజదర్భ, మొలత్రాడు) చేయిస్తారు. ముంజదర్భ మొలత్రాడు వలనగానీ, లేక దారాలతో తయారైన మొలత్రాడు వలనగానీ ప్రయోజనమేమిటి? అని ప్రశ్నపుడుతుంది. మేఖల (మొలత్రాడు) బ్రహ్మచారికి ప్రాణంలాంటిది. కటిబద్ధుడైనాడని తెలుపుతుంది. అంటే నడుము బిగించాడంటే కార్యాన్ని నిర్వహించుటకు సిద్ధమైనాడని అర్థం. అయితే మొలత్రాడు కట్టుకొనుట నేడు తగ్గిపోయి ఉండొచ్చు. అయినా ప్రపంచంలో ఈ మేఖలాధారణ లుప్తం కాలేదు. కాదు కూడా. నేడు లంగోట, ధోవతి బిగించడం, బెల్టు మొదలగునవి మేఖలాస్థానంలోకి వచ్చాయి. అందువలన మేఖలా (మొలత్రాడు) బిగించి బాలకున్ని కటిబద్ధుని (కార్య సమర్థుని)గా చేస్తాడు. బ్రహ్మచర్యాశ్రమంలో ఏ విషయాలకై కటిబద్ధుడు కావాలో వాటిలో ముఖ్యమైనవి "బ్రహ్మచర్యం, తపస్సు-శ్రమ". 'బ్రహ్మ' అంటే 'జ్ఞానం'. 'చర్యం' అంటే చరించుట. తపస్సంటే నియమపాలనం. శ్రమ అంటే పరిశ్రమ చేయుట. మొలత్రాడు కట్టి, బాలకుని ఈ మూడు విషయాలకు సిద్ధం చేస్తాడు ఆచార్యుడు. తన దగ్గరకు వచ్చిన పిల్లలు సంతోషంగా అతనిచేత మొలత్రాడు కట్టించుకుంటూ ఈ క్రింది విధంగా అంటారు.

**"య ఇమాం దేవో మేఖలామాబబన్ధ యః సంననాహ య ఉ నో యుయోజ ।**

**యస్య దేవస్య ప్రశిషా చరామః స పారమిచ్ఛాత్ స ఉ నో విముంచాత్ ॥**

అథర్వ 6-133-1

ఏ ఆచార్యుడు మాకు మేఖలాబంధనం చేస్తాడో, ఏ దేవుడు మమ్మల్ని నీతిబద్ధులను చేస్తాడో, ఎవడు మమ్మ నియమపాలనలో తీర్చిదిద్దుతాడో, ఏ మహాత్ముని అనుశాసనంతో నడుస్తామో ఆ ఆచార్యుడు మమ్ము బ్రహ్మచర్యాశ్రమ పారంగతులుగా చేయుగాక. మమ్ములను స్నాతకులుగా చేసి లోక కళ్యాణార్థం బాహ్యజగత్తుకు సమర్పించునుగాక !

**"ఆహుతాస్యభిహుత ఋషీణామస్యాయుధమ్ ।**

**పూర్వా వ్రతస్య ప్రాశ్నతీ వీరఘ్నీ భవ మేఖలే ॥** అథ. 6.133.2

ఓ మేఖలే! నీవు ఆహుతిచేత సంస్కరింపబడ్డావు. మంత్రాలచే అభిమంత్రితవు. నీవు ఋషులకు ఆయుధం. నీ ద్వారా ఋషులు ఆలస్యం, మదం మొదలైన దుర్గుణాలను దూరంగా పరిగెత్తించగలరు. బ్రహ్మధారణకు పూర్వం నీవు మా శరీరాలలో ప్రతిష్ఠితమవుతావు. నీవు మాలోవున్న ప్రచండమైన కామం, క్రోధం, అలసత్వం మొదలైన శత్రువులను నష్టపరిచి మాకు వీరత్వాన్ని ప్రసాదిస్తావు.

**"శ్రద్ధాయా దుహితా తపసోఽధిజాతా స్వస**

**ఋషీణాం భూతకృతాం బభూవ ।**

**సా నో మేఖలే మతిమా ధేహి మేధామ్**

**అథో నో ధేహి తప ఇన్ద్రియం చ ॥** అథర్వ 6-133-4

ఓ మేఖలే నీవు శ్రద్ధకు బిడ్డవు. తపస్సనే తండ్రికి సంతతివి. ఉజ్వలమైన భూతాన్ని నిర్మించునట్టి ఋషులకు సోదరివి. మాకు బుద్ధినివ్వు. మేధనివ్వు. తపస్సును సమకూర్చు. ఇంద్రియాలకు బలాన్నివ్వు.

"యాం త్వా పూర్వే భూతకృత ఋషయః పరిబేధిరే ।
సా త్వం పరి ష్వజస్వ మా దీర్ఘాయుత్వాయ మేఖలే ॥

అథర్వ 6-133-5

ప్రాచీనమైన భూతకాలాన్ని నిర్మించిన గొప్పగొప్ప ఋషివర్యులు తమ మొలలలో మేఖలను బంధించి కటిబద్ధులైరి. అలాంటి ప్రసిద్ధమైన మొలత్రాడా! నీవు నా నడుమును బంధించి నాకు దీర్ఘాయువును ప్రదానం చేయుము. తల్లిదండ్రులు తమ బాలురను తీసుకొని ఆశ్రమానికి వచ్చి ఈ క్రింది విధంగా అంటారు.

"ఆధత్త పితరో గర్భం కుమారం పుష్కరస్రజమ్ యథేహ పురుషోఽసత్"

గురుజనులారా! మేము మా ప్రియమైన బిడ్డలను కమల పుష్పాలను ధరింపజేసి తమవద్దకు తీసుకొని వచ్చాం. తమరు ఉపనయన సంస్కారం చేసి మీ గర్భంలో ధరించుదురుగాక ! దానివలన వీరు మానవులగుదురు గాక !

## ద్విజత్వ ప్రాప్తి - ద్విజత్వ విధి

"ఆచార్య ఉపనయమానో బ్రహ్మచారిణం కృణుతే గర్భమన్తః తం రాత్రీస్తిస్ర ఉదరే బిభర్తి తం జాతం ద్రష్టు మభిసంయన్తి దేవాః

అథర్వ. 11.5.3

ఆచార్యుడు ఉపనయనం చేసి, బ్రహ్మచారిని (విద్యార్థిని) తన గర్భమునందుంచుకొనును. అతనిని మూడురాత్రుల వరకు - జ్ఞానకర్మ ఉపాసనా విషయమైన మూడు రకాలైన అంధకారావస్థలను దాటి, వసు, రుద్ర, ఆదిత్యోదయ పర్యంతం తన పొట్టలో అనగా తన వద్దనే, తన గురుకుల

కుటుంబంలోనే ధరించి ఉంటాడు. విద్య ద్వారా ద్విజరూపంలో ఉత్పన్నమైన ఆ బ్రహ్మచారిని చూచుటకు, దర్శించుటకు దేవతలు - విద్వాంసులు వచ్చి ఎదురుగా గూమిగూడుతారు.

శారీరక జన్మ తుచ్ఛమైనది. విద్య ద్వారా వచ్చే మానసిక - ఆత్మికమైన (జ్ఞానమయమైన) జన్మయే నిజమైన జన్మ. అందువలన ద్విజుడగుట మనకు గౌరవనీయమైన విషయం. శరీరం పశువులకు కూడా ఉంటుంది. కానీ మానసికంగా, ఆత్మికంగా ఎదిగినప్పుడే వాస్తవంగా మనుష్యుడవుతాడు.

రెండవ జన్మ కేవలం అలంకారప్రాయం కాదు. ఇది వాస్తవమైంది. అనుభవంలో కన్పించేది. అగ్నిలో తపించితే బంగారం స్వచ్ఛమైనట్లుగా ఆచార్యాధీనంలో గురుకులం నుండి బ్రహ్మచర్యవ్రతపాలకుడైనప్పుడు సంస్కృతుడవుతాడు.

కానీ, నేడు ఉపనయన (యజ్ఞోపవీత) సంస్కారం ఎక్కడ జరుగుతున్నది? తేజఃసంపన్నుడైన ఆత్మ సమర్పణ చేయగల గురువెక్కడున్నాడు? విద్యను ధారణ చేయగల విద్యార్థులెంతమంది? అలాంటి వారున్నప్పుడు ఆచార్య గర్భంనుండి వెలువడు స్నాతకులు సత్యస్వరూపులుగాను, అజరామరులుగాను తయారవుతారు. వారు నిజంగా సత్యలోకవాసులై జరామృత్యువులనుండి భయపడరు. ఆచార్యుడు యజ్ఞోపవీతమిస్తూ బ్రహ్మచారిని తన దగ్గరకు (ఉప = సమీపానికి, నయన = తీసికొనుట) తీసుకొంటాడు. ఈవిధంగా ఆచార్యుడు - బ్రహ్మచారుల మధ్య భేదం తొలగిపోతుంది. వారిద్దరి మధ్య ఏవిధమైన భేదం ఉండదు. బ్రహ్మచారి ఆచార్యునికి సంబంధించినవాడైపోతాడు. ఆచార్యునికి మరొక అంగంగా విద్యార్థి ఉంటూ ఆచార్యునియందే తన సర్వక్రియాకలాపాలు సాగిస్తాడు. ఆచార్యుడు శ్వాస పీల్చుకొనేటప్పుడు విద్యార్థి

కూడా శ్వాస తీసుకొంటాడు. ఇందులో అతిశయోక్తి ఏమాత్రం లేదు. గురుకులవాసమంటే ఆచార్య గర్భంలో నివసించడమే.

ఈ ఉపనయనం ఎలా జరుగుతుంది? బ్రహ్మచారి ఆచార్యునివద్దకు ఎలా ఆకర్షింపబడతాడు? ఏవిధంగా వారిద్దరి మధ్య ఐక్యత ఏర్పడుతుంది? ఈ విషయాలన్నీ చెప్పుటసాధ్యపడదు. కారణం మాటలలో వ్యక్తం చేయాలంటే ఆచార్యులవారు శిష్యునిలో తన శక్తినంతటిని నింపుతాడనే చెప్పాలి. **"మమ చిత్తం తే అస్తు"** అనుట నోటితో ఉచ్ఛరించడం మాత్రమే గాదు. ఆచార్యుడు శిష్యుని హృదయంలో తన సూక్ష్మ శరీరం ద్వారా ప్రవేశించి శిష్యుని చిత్తాదులను తనలో కలుపుకొంటాడు. శిష్యునిలో వున్న కుండలినీ శక్తిని ఆచార్యుడు మేలుకొల్పుతాడు. శిష్యుని హృదయంలో ఆచార్యులవారు ఒక రకమైన శ్రేష్ఠ ఆచరణ-జ్ఞాన బీజాన్ని నాటుతాడు. శిష్యుడు ఆచార్యుని నీడలో వేగంగా వికసితుడౌతాడు. ఈ ఉపనయన సంస్కార సమయంలో వాస్తవంగా రెండు జ్యోతులు ప్రత్యక్షంగా పరస్పరం కలిసిపోతాయి. రెండు అంతరాత్మల మధ్య సంబంధం స్థాపింపబడుతుంది. ఈ మాటలను నేడు ఎవరు విశ్వసించగలరు? అయినా ఈ విషయాలు ముమ్మాటికీ వాస్తవాలు. అందువల్లనే వేదవచనాలు కేవలం ఆలంకారిక వచనాలే గాదు. నిత్యసత్యవచనాలు.

ఆచార్యుడు ఉదరంలో ఈ గర్భాన్ని మూడు రాత్రుల వరకు ధరిస్తాడని వేదమంటుంది. ఆచార్యుని కులం అంటే గురుకులమే. ఉదరం అంటే అందులో బ్రహ్మచారి గర్భంగా మారి తొమ్మిది మాసాలకు బదులుగా మూడురాత్రుల వరకే ఉంటాడు. అయితే బ్రహ్మచారి ఉండే ఈ మూడురాత్రులు చాలా దీర్ఘమైనవి. అవి 48 సంవత్సరాలతో పూర్తి అవుతాయి. ఆ సమయంలో మూడు విద్యలు (జ్ఞాన-కర్మ-ఉపాసనలు) లేక నాలుగు వేదాలు అధ్యయనం

చేయగలుగుతాడు. విద్యాత్రయప్రాప్తి కొరకు ఆ బ్రహ్మచారి జ్ఞానావస్థత్రయాన్ని దాటవలసి వస్తుంది. అందుకు మూడురాత్రులు గడపాలి. అందువలన ఇక్కడ మూడు రోజులనుటకు బదులు మూడు రాత్రిళ్ళు అనాల్సివచ్చింది. వరుసగా రాత్రిళ్ళు మూడు రావుగా. మధ్యలో రెండు పగళ్ళుంటాయి. అయితే ఆ పగళ్ళు గౌణములు. ఆ మధ్య వచ్చే పగళ్ళు కూడా ప్రకాశం బూదరబూదరగా ఉంటాయి. మూడు రాత్రిళ్ళు గడిచిన తరువాత వచ్చే పగలే వాస్తవమైన పగలు. ఆ రోజే ఆదిత్యప్రకాశం స్పష్టంగా కనబడుతుంది. మొదటి రాత్రి సమాప్తి కాగా అంటే 24 సం॥లు పూర్తి అయిన తరువాత బ్రహ్మచారికి వస్తువుల జ్ఞానం కలుగుతుంది. అదే ఋగ్వేద ప్రతిపాదితమైన జ్ఞానకాండ-పదార్థ జ్ఞానం. భూలోక జ్ఞానప్రాప్తి. ఈ జ్ఞానంతో సంతృప్తి చెందని బ్రహ్మచారి మరుసటి రాత్రి అంటే 36 సం॥ల వరకు ఉండవలసి వస్తుంది. అప్పుడతనికి రుద్రప్రకాశం లభిస్తుంది. అది యజుర్వేద ప్రతిపాదితమైన కర్మకాండం. అంతరిక్ష సంబంధమైన జ్ఞానం కలుగుతుంది. అతడు మూడవరాత్రి కూడా బ్రహ్మచారి అవస్థలో గడిపినట్లయితే 48వ సంవత్సరంలో ఆదిత్య ప్రకాశమును పొంది సామ-ఉపాసనా-ద్యులోక-జ్ఞానం ప్రాప్తిస్తుంది. అప్పుడతనికి సాక్షాత్తుగా ఆదిత్యదర్శనం కలుగుతుంది. అప్పుడు ఉపనయన సంస్కారంలో బ్రహ్మచారికి చూపించే సూర్యదర్శనం అనే మహదుద్దేశ్యం పూర్తి అవుతుంది. అథర్వవేదానికి సంబంధించిన విజ్ఞానకాండ కూడా ఇందులో కలిసి ఉందని వేరే చెప్పాల్సిన పనిలేదు. ఏ బ్రహ్మచారి 48 సంవత్సరాలుగానీ, లేక తన శక్త్యానుసారం ఇంకా తక్కువ సంవత్సరాలలో గానీ ఈ మూడు రాత్రులు ఆచార్యుని ఆధీనంలో ఉంటాడో అతనిని 'ఆదిత్యబ్రహ్మచారి' అనీ అతడే ఆచార్యుని గర్భం నుండి పూర్ణంగా జన్మించాడనీ చెప్పగలుగుతాం.

నచికేతుడు కూడా యమాలయంలో మూడురాత్రులు ఉపవాసం ఉన్నాడని కఠోపనిషత్తు ప్రతిపాదిస్తున్నది. ప్రతి జిజ్ఞాసువైన బ్రహ్మచారి నచికేతుడే. మొదటి రూపాన్ని పూర్తిగా మార్చివేసి నూతన రూపాన్నిచ్చు ఆచార్యుడే మృత్యువని కఠోపనిషత్తు స్పష్టపరుచుచున్నది. ఈ యమాచార్యుని వద్ద బ్రహ్మచారి మూడురాత్రుల వరకు ఏమీ తినకుండా (అంటే భోగాలకు దూరంగా) బ్రహ్మచర్యవ్రతదీక్షలో ఉన్నప్పుడు ఈ మూడురాత్రులు చేసిన తపస్సు కారణంగా మూడు వరాలు (మూడు సిద్ధులు లేక మూడు రకాలైన జ్ఞానాలు) లభిస్తాయి. ఒకటి తండ్రి మొ॥వారికి సంతృప్తి అంటే భూలోక సుఖప్రాప్తి రూపమైన వరం. 2. అంతరిక్షానికి సంబంధించిన స్వర్గ సంబంధమైన అగ్నిజ్ఞానం. 3. చివరకు గుహ్యమైన ఆత్మతత్త్వానికి సంబంధించిన దివ్యజ్ఞానమయమగు అతిదుర్లభ వరం. నిస్సందేహంగా ఈ మూడురకాలైన జ్ఞానాలను పొంది ఆదిత్యబ్రహ్మచారి సత్య–అజర–అమర స్వరూపుడవుతాడు.

ఇదంతా రాత్రిత్రయ భోగరహిత జీవితఫలం. ఆచార్యగర్భంలో సుదీర్ఘమైన రాత్రిత్రయపర్యంతం గడిపిన బ్రహ్మచర్య జీవితఫలం లేనిచో 'ఆదిత్యుడు' అనబడే దివ్యజన్మప్రాప్తి అసంభవం. ప్రపంచంలో ప్రసిద్ధి పొందిన పురుషోత్తమ శ్రీరామచంద్రుడు, యోగిరాజ్ శ్రీకృష్ణుడు, మహర్షి దయానందుడు మొదలైనవారందరు దివ్యజ్ఞానాన్ని పొందుటకు (రూపాంతర పరిణామంలో) ముందు ఇలాంటి అంధకారమయమైన అవస్థలలో, రాత్రులలో గడిపినవారే. రాత్రితో–అజ్ఞానంతో బ్రహ్మచారి చేసినట్టి నిరంతర యుద్ధం–తపస్సు వలననే అతడు ద్యులోకం వరకు చేరగలుగుతున్నాడు. ఆదిత్యుడగుచున్నాడు. నూతనజన్మ కలుగుతుంది.

ఈవిధంగా ఆదిత్యబ్రహ్మచారి ఆచార్య గర్భంనుండి జన్మించగా, అతడు ఆదిత్యుని (సూర్యుని) వలె జగత్తులో ఉదయిస్తాడు. అతనిని దర్శించుటకు

దేవతలు (విద్వాంసులు) వస్తారు. నూతనంగా బాలుడు భౌతికంగా జన్మించినప్పుడు ఇరుగుపొరుగువారు చూచునట్లుగా ఈ మహాదివ్య జన్మనెత్తిన ఆదిత్యబ్రహ్మచారిని చూచుటకు కూడా విజ్ఞులెందరో వస్తారు. ఈ సమయంలో దేవతలే వస్తారు. మామూలు ప్రజలు ఈ దివ్య మహత్త్వం తెలుసుకోలేరు. మామూలు విద్వాంసులేగాదు, దివ్య పురుషులు, జ్ఞానశ్రేష్ఠులు- గురుకులం నుండి స్నాతకుడైన పూర్ణ విద్వాంసుని దర్శించుటకు వస్తారు. మరియు ప్రపంచంలోవున్న స్థూల, సూక్ష్మ దివ్యశక్తులు (దేవతలు) కూడా ఉదయించిన సూర్యునికి అభిముఖులై దర్శించు ప్రజలవలె, ఈ మహత్త్వపూర్ణమైన సన్నివేశాన్ని చూచుటకు ఏతెంచుతారు.

మొదటి రెండు రాత్రులలో ఈ క్రింది విషయాలను హృద్గతం చేసుకొన్నవారికే ఈ విషయాలు పూర్తిగా అవగతమవుతాయి.

1) **"తస్మిన్దేవాః సంమనసో భవన్తి"** అథ. 11.5.1

2) **"దేవా అనుసంయన్తి సర్వే ॥**

దేవతలందరు (విద్వాంసులు) ఆ ఆదిత్య బ్రహ్మచారికి అనుకూలంగా ఉంటారు. వారందరు అతనిని అనుసరించి వెళ్తారు. ఆదిత్య బ్రహ్మచారి ఈ ప్రపంచంలో మానవత్వానికి పరిపూర్ణాకృతి. అతడు దేవతలకు కూడా దర్శనీయుడు. నిజంగా ఇలాంటి దివ్యజన్మ సంభవించినప్పుడు సమస్త దేవతలు ఆనందంతో అతనికి ఎదురుగా వెళ్ళి స్వాగతం చెప్తారు.

## శిష్టాచారం

శిష్యులను గురించి వారి ఆచారాలను గురించి మహాభాష్యకారుడైన పతంజలి మహర్షి ఎంతో చక్కగా వారి భావాలను వ్యక్తం చేశారు. సజ్జనుడు, శాస్త్రవిహితకర్మను చేయువాడు అను అర్థంలో శిష్టశబ్దం మహాభాష్యంలో

ప్రయోగింపబడింది. శిష్టులెవరని ప్రశ్నించి తానే స్వయంగా సమాధానం కూడా చెప్పినాడు. శిష్టునికి రెండు విశిష్టతలు పేర్కొన్నారు. నివాసం - ఆచారం.

శిష్యుడగుటకు ఏ ఆచారం అవసరమో అది ఆర్యావర్తదేశం నుండే సులభంగా లభిస్తుంది. అందువలన ఆర్యావర్తమందున్న బ్రాహ్మణుడు "కుంభీధాన్యుడు, అలోలుపుడు, ఇంద్రియవశంకరుడు, ఏదో ఒక విద్యలో పారంగతుడైనవాడు - శిష్టుడుగా పరిగణింపబడుతున్నాడు.

## ఆచార్య మహిమ

**ఋత్విక్ పురోహితాచార్యాః మృదుబ్రహ్మధరా హి తే**
**క్షాత్రేణాపి చ సంస్పృతేజః శామ్యతి వై ద్విజే ॥**

మహాభారతం 59-24

ఋత్విక్కు పురోహితుడు, ఆచార్యుడు వీరు సాధారణంగా కోమల స్వభావం కలవారుగా ఉంటారు. వేదాలను కంఠస్థం చేస్తారు. క్షత్రియ తేజస్సు కూడా బ్రాహ్మణుని సమీపించగానే శాంతిస్తుంది.

**ధర్మ ఏవ గతిస్తేషాం ఆచార్యోపాసనాద్భవేత్ ।**
**దేవలోకం ప్రపద్యన్తే యే ధర్మం పర్యుపాసతే ॥**

మ.భా. 162-30

ఆచార్యుని సేవించు మానవులకు ధర్మమే ముఖ్యమైన ఆధారం. ధర్మాన్ని పాటించేవారు దేవలోకానికి పోతారు.

**"ఆచార్యస్య పితుశ్చైవ సఖ్యురాప్తస్య చాతిథేః**
**ఇదమస్తి గృహే మహ్యమితి నిత్యం నివేదయేత్.**
**తే యద్వదేయుస్తత్ కుర్యాదితి ధర్మో విధీయతే** ॥మ.భా.162-31

ఆచార్యుడు, తండ్రి, విశ్వాసపాత్రుడైన మిత్రుడు, అతిథి వీరితో "అయ్యా! ఫలానా వస్తువు నా గృహంలో తయారుగా వుంది. దానిని మీరు స్వీకరించండని" నివేదించాలి. తరువాత వారెలా ఆజ్ఞాపించిన అలా చేయాలి. అలా చేయుట ధర్మాన్ని పాటించినట్లే.

"యః శ్రోత్రయోరమృతం సంనిషిఞ్చేత్

విద్యామవిద్యస్య యథామమాయమ్ ।

తం మన్యేఽహం పితరం మాతరం చ

తస్మై న ద్రుహ్యేత కృతమస్య జానన్ ॥

ఋతస్య దాతారమనుత్తమస్య

నిధిం నిధీనామపి లబ్ధవిద్యాః

యే నాద్రియన్తే గురుమర్చనీయం

పాపాన్ లోకాంస్తే వ్రజన్త్యప్రతిష్ఠాః ॥

మ.భా.అ. 76, 63, 64

నా వంటి విద్యావిహీనుని శ్రవణ పుటాలలో విద్య అనే అమృతాన్ని ఎవరు నింపుతున్నారో, అలాంటి ఆచార్యవర్యుని నేను తండ్రిగాను, తల్లిగాను భావిస్తాను. అతడు మానవ జన్మపొంది అలాంటి పరమపూజ్య గురుదేవుడు చేసిన ఉపకారాన్ని స్మరిస్తూ ద్రోహం తలపెట్టకుండా ఉండుగాక !

అంత శ్రేష్ఠమైన సత్యజ్ఞాన ప్రదాత, నిధులలో ఉత్తమ నిధి అయిన విద్యానిధిని అందించే పూజనీయుడైన గురువునుండి విద్యను పొంది, అతనిని ఆదరించనివాడు అస్థిరమతియై పాపజనిత దుఃఖమయ జన్మలు పొందుతాడు.

"అధ్యాపితా యే గురూన్నాద్రియన్తే
విప్రా వాచా మనసా కర్మణా వా ।
యథైవ తే న గురోర్భోజనీయాః
తథైవ తాన్న భునక్తి శ్రుతం తత్ ॥ నిరుక్తం 2-1-4

గురువు వద్ద విద్య నేర్చుకొని జ్ఞానవంతుడైన ఏ శిష్యుడు తన గురువును త్రికరణశుద్ధిగా ఆదరించడో (మనసా వాచా కర్మణా) గురువు ఉపదేశాన్ని పాలించడో అలాంటి శిష్యునికి ఆ విద్య ఉపయోగపడదు.

"నమో నమస్తే గురవే మహాత్మనే
విముక్త సఙ్గాయ సదుత్తమాయ ।
నిత్యాద్వయానన్త రసస్వరూపిణే
భూమ్నే సదాపారదయామ్బుధామ్నే ॥ వివేక-487

మహాత్ములు, ఆసక్తిరహితులు, సత్పురుషులలో ఉత్తములు, సదా పరమానంద రసనిమగ్నులు, విశాలజ్ఞానసంపన్నులు, అపారదయాసముద్రులు అయిన గురుదేవులకు మాటిమాటికి నమస్సులు చెల్లించుదుము గాక !

య ఆవృణోత్యవితథం బ్రహ్మణా శ్రవణావుభౌ ।
స మాతా స పితా జ్ఞేయస్తం న ద్రుహ్యేత్కదాచన ॥

మను. 2. 144

ఏ గురువుగానీ, ఆచార్యుడుగానీ వేదజ్ఞానం ద్వారా రెండు శ్రవణాలను చక్కగా పూరించునో, అతనినే తల్లిగాను, తండ్రిగాను గుర్తించాలి. అలాంటి గురువును గురించి ఎప్పుడూ ద్రోహచింతన చేయరాదు.

ఇదే భావం గల శ్లోకం నిరుక్తశాస్త్రంలో వుంది. శబ్దార్థ దృష్టిలో పై శ్లోకంలో కలుస్తుంది.

యః ఆవృణోత్యవితథేన కర్ణావదుఃఖం
కుర్వన్నమృతం సంప్రయచ్ఛన్ ।
తం మన్యతే పితరం మాతరం చ
తస్మై న ద్రుహ్యేత్ కతమచ్చనాహ ॥ నిరుక్త. 2-1-4

## ఆచార్యుని విషయంలో శిష్యుని కర్తవ్యం

ప్రశ్న: ఆచార్యునితో శిష్యుడు ఎలా ప్రవర్తించాలి? ఎలా ప్రవర్తించ రాదు?

జ: మహర్షి దయానంద సరస్వతి తను రచించిన వ్యవహారభానువులో ఇలా వ్రాసారు. అబద్ధాలు వదిలి సత్యాన్నే చెప్పుట, సరళంగా ఉండుట. అభిమానం చూపకుండుట. తన గొప్పతనాన్ని చూపరాదు. ఆజ్ఞలను పాటిస్తూ ప్రశంసించాలి. నిందించరాదు. గురువు సమీపంలో ఉన్నతాసనం అలంకరించరాదు. శాంతంగా ఉండాలి. చపలత్వం చూపరాదు. ఆచార్యుడు దండించినా ప్రసన్నంగా ఉండాలి. ఎప్పుడూ కోప్పడరాదు. ఆచార్యులవారు ఏదైనా ప్రశ్నించినప్పుడు చేతులు జోడించి వినమ్రుడై జవాబు చెప్పాలి. గర్వంగా జవాబివ్వరాదు. ఉపదేశించేటప్పుడు మనసు ఉంచి వినాలి. నవ్వులు పనికిరావు. శరీరాన్ని, వస్త్రాలను పరిశుభ్రంగా ఉంచుకోవాలి. మురికిగా ఉండరాదు. ఏదైనా చెప్పినట్లు చేయడం నేర్చుకోవాలి. జితేంద్రియుడుగా వుండాలి. లంపటుడుగా ఉండరాదు. వ్యభిచరించరాదు. సజ్జనులను ఎల్లప్పుడూ గౌరవిస్తూండాలి. ఎప్పుడూ అవమానించరాదు. ఇతరులు చేసిన ఉపకారాన్ని గుర్తుంచుకొని కృతజ్ఞుడుగా ఉండాలి. పురుషార్థి కావాలి. సోమరిగా ఎప్పుడూ ఉండరాదు. విద్యాప్రాప్తికి తగిన సాధనలనన్నింటిని సాధిస్తుండాలి. విద్యాప్రాప్తికి వ్యతిరేకమైన పాపకర్మలను కామ-క్రోధ-లోభ-మోహ-భయ- శోకాదులను వదిలి, సదా ఉత్తమ

గుణాలను అలవరచుకోవాలి. పాపకర్మలలో క్రోధం, విద్యాగ్రహణంలో లోభం, సజ్జనులలో మోహం, దుష్టకర్మలలో భయం, పుణ్యకార్యాలు చేయనందుకు శోకిస్తూ విద్య మొదలైన శుభగుణాల ద్వారా ఆత్మను వీర్యం మొ॥ ధాతువులతో రక్షించుకొంటూ, జితేంద్రియుడై, శారీరక బలాన్ని సదా పోషించుకొంటూ ఉండాలి.

## శిష్యుని విషయంలో ఆచార్యుని కర్తవ్యం(వ్యవహారభానువు నుండి)

**ప్రశ్న: ఆచార్యుడు విద్యార్థులతో ఎలా ప్రవర్తించాలి?**

జ: గురువు ప్రవర్తన వలన, విద్యాబుద్ధులు నేర్పే విధానం వలన, సదాచారం వలన, తన విద్యార్థి విద్వాంసుడుగాను, సుశీలసంపన్నుడు గాను, నిరభిమానిగాను, సత్యవాదిగాను, ధర్మాత్ముడుగాను, ఆస్తికుడుగాను, పురుషార్థిగాను, సతతోద్యోగిగాను, పరోపకారిగాను మారాలి. వీరుడు-ధీరుడు, పవిత్రాచారసంపన్నుడు, శాంతస్వభావి, దమనశీలుడు, జితేంద్రియుడు, ఋజుమార్గ ప్రవర్తకుడు, ప్రసన్నవదనుడుగా శిక్షణ పొందాలి. తల్లిదండ్రులను, ఆచార్యులను, అతిథులను, బంధువులను, మిత్రులను, రాజును (ప్రభుత్వాన్ని) ప్రజలను గౌరవిస్తూ, వారికి ప్రియపాత్రుడుగా మెలుగునట్లు తీర్చిదిద్దబడాలి. ఎవరితో మాట్లాడుచున్నా విద్యార్థి ముఖం నుండి వెలువడే అక్షరాలు, పదాలు, వాక్యాలు శాంతిపూర్ణాలై వుండాలి. ప్రశాంతంగా జవాబులిస్తుండాలి. శిష్యులు చెడుపనులు చేసినప్పుడు, మురికిగుడ్డలు ధరించినా, తరగతిలో అసభ్యంగా కూర్చొన్నా, నిందలకు, ఈర్ష్యలకు, ద్రోహాలకు, వివాదాలకు పాల్పడినా, చాడీలు చెప్పినా, మిథ్యారోపణలు చేసినా, అతిభోజనం, అతినిద్ర, అతిజాగారం చేసినా, చోర-జారత్వాలకు లొంగిపోయినా, సోమరిగావున్నా, వ్యర్థంగా కాలం గడుపుతున్నా, విషయభోగాలలో పాల్గొన్నా, దుష్టసహవాసం చేసినా వారిని గురువులు యథాపరాధంగా దండించాలి.

ప్రశ్న: ఆచార్యుడు ఏ పద్ధతిలో విద్యను, నేర్పాలి? విద్యార్థులు ఎలా గ్రహించాలి?

జ: ఆచార్యుడు ఏకాగ్రచిత్తుడై విద్యార్థులకు విద్యను బోధించాలి. దానివలన విద్యార్థులలో ఉత్సాహం పెరుగుతుంది. విద్యార్థులు అధర్మపరులగునట్లు గురువుల ఆచరణ ఉండరాదు.

ఉదాహరణకు: హస్తక్రియలు, యంత్రాలు, కళాకౌశలం మొదలైన వాటిద్వారా విద్యార్థుల మనస్సులలో పదార్థజ్ఞానం కలిగినచో వేలకొద్దీ పదార్థాలను గురించి వారికి వారే తెలుసుకోగలుగుతారు. ఆచార్యుడెప్పుడూ ఈ క్రింది విధంగా ఆలోచించాలి. నా విద్యార్థులు ఎల్లప్పుడూ విద్వాంసులై ధర్మాచరణతత్పరులు కావాలి. నా విద్యార్థులు అవిద్వాంసులై, కుశిక్షితులై నాకు నిందలు తెచ్చేవారు కాకుండా ఉండాలి. పరమేశ్వరుని గుణకర్మ స్వభావాలకు విరుద్ధమైన గుణకర్మ స్వభావాలు ఉన్నందున మహాదుఃఖాన్ని అనుభవించే పరిస్థితులు రాకుండుగాక. పరుల సుఖదుఃఖాలు తన సుఖదుఃఖాలుగా భావించే పుణ్యపురుషులే ధన్యులని తెలుసుకొని ధర్మం ఎప్పుడూ త్యజించరాదనే ఉత్తమాచారాన్ని ఆచార్యులు అనుసరిస్తూ ఉండాలి. ఆచార్యులు ప్రసన్నులయ్యే సత్కర్మలను విద్యార్థులు కూడా ఆచరించాలి. అలాంటి పవిత్రకర్మలను చేస్తూ గురువుల మనస్సుకు సంతోషాన్ని కలిగిస్తూ విద్యార్థులు సువిద్వాంసులైనారని ఆచార్యులు తృప్తిపడునట్లు ప్రవర్తించాలి. రాత్రింబవళ్ళు విద్యకు సంబంధించిన విషయాలలోనే లగ్నమై పరస్పర ప్రేమతో విద్యను విస్తరింపజేస్తూ ఉండాలి. విషయ సుఖాలకు సంబంధిత విషయాలొచ్చినప్పుడు అశ్లీల ప్రసంగాలు జరుగునప్పుడు అక్కడ క్షణమాత్రం ఆగరాదు. ఎక్కడ విద్యా విజ్ఞానానికి సంబంధించిన చర్చలు జరుగునో, ధార్మిక చింతనలు జరుగునో, నీతిబోధలు జరుగునో వాటిలో పాల్గొని జ్ఞానార్జన చేయాలి. భోజనం, ఆచ్ఛాదనం ఆరోగ్యాన్ని పెంపొందించునదిగా ఉండాలి. బుద్ధిని

నాశనం చేసే మాదక పదార్థాలను ముట్టరాదు. బుద్ధిని పెంచేవి, రోగనాశకాలైన పదార్థాలనే సేవించాలి. నిత్యం పరమేశ్వర ధ్యానం, యోగాభ్యాసం, మేధస్సును పెంచుకొనుట, సత్యధర్మాలలో భక్తి, అధర్మాన్ని సంపూర్ణంగా త్యజించుట మొదలైన సత్కర్మలను అభ్యసిస్తుండాలి. విద్యార్జనకు బాధ కలిగించే ఏ పనిని చేపట్టకుండా సంపూర్ణ విద్వాంసుడగుటకు సత్కృషి చేయాలి. పైనపేర్కొన్న గుణకర్మలన్నీ ఆచార్యునికి విద్యార్థులకు సంబంధించినవే. ఎవరివంతు వారు నియమం తప్పకుండా ఆచరిస్తుండాలి.

## నవ స్నాతకులకు ఆచార్యుని ఉపదేశం

"వేదమనూచ్యాచార్యోఽన్తేవాసినమనుశాస్తి-సత్యం వద ।
ధర్మం చర ।
స్వాధ్యాయాన్మా ప్రమదః । ఆచార్యాయ ప్రియం
ధనమాహృత్య ప్రజాతన్తుం మా వ్యవచ్ఛేత్సీః ।
సత్యాన్నప్రమదితవ్యమ్ । ధర్మాన్న ప్రమదితవ్యమ్ । కుశలాన్న
ప్రమదితవ్యమ్ । భూత్యై న ప్రమదితవ్యమ్
స్వాధ్యాయప్రవచనాభ్యాం న ప్రమదితవ్యమ్ (1)
దేవపితృకార్యాభ్యాం న ప్రమదితవ్యమ్ । మాతృదేవో భవ ।
పితృదేవో భవ । ఆచార్యదేవో భవ । అతిథిదేవో భవ ।
యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని, నో ఇతరాణి ।
యేకేచాస్మచ్ఛ్రేయాంసో బ్రాహ్మణాస్తేషాం త్వయాసనేన
ప్రశ్వసితవ్యమ్ । శ్రద్ధయా దేయమ్, అశ్రద్ధయా దేయమ్,
హ్రియా దేయమ్, భియా దేయమ్ । సంవిదా దేయమ్ ॥

అథ యది తే కర్మవిచికిత్సావా వృత్తివిచికిత్సా వా స్యాత్(2,3)
యే తత్ర బ్రాహ్మణాః సమ్మర్శినో యుక్తా అయుక్తాః అలూక్షా
ధర్మకామాః స్యుర్యథా తే తత్ర వర్తేరన్, తథా తత్ర వర్తేథాః,
ఏష ఆదేశ ఏష ఉపదేశ ఏష వేదోపనిషత్ । ఏతదనుశాసనమ్
ఏవముపాసితవ్యమ్ । ఏవముచైతదుపాస్యమ్ ॥ (4)

తైత్తరీయ-శిక్షా. 11. 1-4

విద్యార్థులకు, విద్యార్థినులకు విద్య పూర్తయిన తరువాత ఆచార్యులు తమ శిష్యులకు ఈ క్రింది విధంగా ఉపదేశించాలి:

నీవు ఎప్పుడూ సత్యాన్నే చెప్తూ ధర్మాన్నే ఆచరిస్తూ ప్రమాద రహితుడవై చదువుతూ చదివిస్తూ బ్రహ్మచర్య వ్రతధారివై సమస్త విద్యలలో పారంగతుడవై ఆచార్యులకు ప్రియమైన ధనాన్ని దక్షిణగా సమర్పించి, వివాహం చేసుకొని, సత్సంతానం కనుము. ప్రమాదం వలన (పొరపాటున కూడా) సత్యాన్ని ఎప్పుడూ విడువరాదు. అలాగే ధర్మాన్ని వదలరాదు. ప్రమాదం వలన (అజాగ్రత్త వలన) ఆరోగ్యాన్ని ఉత్తమైశ్వర్యాభివృద్ధిని మరువరాదు. అధ్యయన-అధ్యాపన కార్యం ఎప్పుడూ విడువరాదు (1).

దేవతల (విద్వాంసుల), తల్లిదండ్రుల సేవలో లోటు చేయరాదు.

విద్వాంసులను గౌరవించినట్లే తల్లిదండ్రులను గౌరవించాలి. అశ్రద్ధ చేయరాదు. విద్వాంసులను గౌరవించినట్లే తల్లిదండ్రులను, గురువులను, ఆచార్యులను, అతిథులను గౌరవించి వారికి తగిన సేవాశుశ్రూషలు చేయాలి. మీకు తల్లి దేవత, తండ్రి దేవత, ఆచార్యుడు దేవత, అతిథి దేవత.

అనిందితములు, ధర్మయుక్తములైన సత్యభాషణాది సత్కర్మలను చేస్తూ, తద్భిన్నములైన మిథ్యాభాషణాదులను వదలాలి. మే మాచరించే సుకర్మలను అనగా ధార్మిక కృత్యాలనే మీరు ఆచరించాలి. మాలో ఏదైనా పాపాచరణం ఉన్నచో దానిని పూర్తిగా వదిలివేయాలి.

మాలో ఉత్తములైన విద్వాంసులను, ధర్మాత్ములైన బ్రాహ్మణులను (బ్రహ్మజ్ఞానులను) సమీపించి వారి సేవలో ఉంటూ వారిని విశ్వసించాలి. శ్రద్ధతోగానీ, అశ్రద్ధతోగానీ, శోభతోగానీ, లజ్జతోగానీ, భయంతోగానీ ప్రతిజ్ఞతో గానీ దక్షిణ ఇవ్వాలి. నీకెప్పుడైనా కర్మవిషయంలోగానీ, శీలవిషయంలోగానీ, ఉపాసనా విషయంలోగానీ జ్ఞాన సంబంధమైన విషయంలో గానీ, సందేహం వున్నచో ఈ క్రిందివారిని అడిగి తెలుసుకోవాలి.

విచార విమర్శశీలురు, పక్షపాతరహితులు, యోగ్యులు, తపఃసంపన్నులు, ఆర్ద్రచిత్తులు, ధర్మాభిలాషులు, ధర్మాత్ములు వీరందరు ఎలా ఆచరిస్తారో మీరు కూడా వారిననుసరించి అలా ఆచరించండి. ఇదే ఆదేశం (ఆజ్ఞ), ఇదే ఉపదేశం. ఇదే వేదసందేశం. ఇదే దివ్య ఉపనిషత్తుల ఆదేశం. ఈ విధంగా ప్రవర్తిస్తూ, మీ నడవడికలను సరిచేసుకోండి.

ప్రాచీన గురుకులాలలో, విద్యాలయాలలో ఆధునిక విశ్వవిద్యాలయాలలో సమావర్తన సంస్కార సంబంధంగా దీక్షాసమయం అందించే స్నాతకోత్సవోపదేశం మన ప్రాచీనమైన తైత్తిరీయోపనిషత్తు ఆధారంగానే జరుగుతుంది. విద్యాసమాప్తి సమయంలో ఆచార్యుడు తన అన్తేవాసికి (శిష్యునికి) ఈ క్రింది విధంగా ఉపదేశం చేయడం జరుగుతుంది.

## సత్యంగా వ్యవహరించు - ధర్మంగా నడుచుకో

మీ జీవితంలో ఏవైనా సందేహాలొస్తే 'ఏది ధర్మం, ఏది అధర్మం' అను విషయం నిర్ణయించుకోవాలనుకున్నప్పుడు బ్రహ్మజ్ఞానులు, విచార,విమర్శ

నిపుణులైన యోగీశ్వరులు, తపఃసంపన్నులు, నిఃస్వార్థపరులైన ధర్మపరాయణులు ఏది ధర్మమని ఆచరిస్తారో, ఏది పుణ్యమని జీవన ధ్యేయంగా భావిస్తారో మీరు కూడా వారిని ఆదర్శంగా తీసుకొని అలాగే ఆచరించండి. ఇదే మా ఆదేశం (ఆజ్ఞ). ఇదే ఉపదేశం. ఇదే వేదశాస్త్రాల ఆజ్ఞ- అనుశాసనం కూడా. ఇదే చేయదగింది. దీనినే మీరు పాటించండి.

గురుకులంలో గల ఈ ఆచారం ఉపనిషత్కాలం నుంచి అమలులో ఉంది. ఈ ఉపదేశంలో విద్యకు సంబంధించినవేగాక భావిజీవితంలో విద్యార్థులు ఎలా ప్రవర్తించాలో అనే అంశం కూడా సంక్షిప్తంగా చెప్పబడింది. వేదారంభ సంస్కార సమయంలో బాలురకు తండ్రి ద్వారా ఇవ్వబడే ఉపదేశాన్ని విద్యపూర్తయిన తరువాత ఆచార్యుడిచ్చే ఉపదేశాన్ని కలిపి చూసినచో నేడు కనబడే విద్యాధ్యయనములకన్నా, పాటించే ఆచారాల కన్నా, వైదిక సంస్కృతికి సంబంధించిన విద్యా సిద్ధాంతాలు చాలా ఉదాత్తమైనవిగా, ఉత్తమోత్తమమైనవిగాను అనుసరించదగినవిగాను కనబడుచున్నవి.

**"ఆచార్యకులాద్వేదమధీత్య,యథావిధానం గురోఃకర్మాతిశేషేణా భిసమావృత్య, కుటుంబే శుచౌ దేశే స్వాధ్యాయమధీయానో ధార్మికాన్విదధదాత్మని సర్వేంద్రియాణి సంప్రతిష్ఠాప్య అహింసన్ సర్వభూతాని అన్యత్ర తీర్థేభ్యః, స ఖల్వేవం వర్తయన్ యావదాయుషం బ్రహ్మలోక మభిసంపద్యతే"** చాందోగ్య. 8. 15. 1

ఆచార్య కులంనుండి వేదశాస్త్రాలను చదివి, గురువులకు దక్షిణ సమర్పించి, సమావర్తన సంస్కారం నుండి తిరిగి వచ్చి, కుటుంబంలో స్వాధ్యాయరతుడవుతూ, ధార్మిక విద్వాంసుల సత్సంగంలో పాల్గొంటూ,

ఇంద్రియాలను స్వాధీనంలో ఉంచుకొంటూ, సర్వప్రాణులను అహింసా బుద్ధితో చూస్తూ, ఆయుఃపర్యంతం ఈ విధంగా వ్యవహరిస్తూ ఉండే విద్వాంసుడే బ్రహ్మలోకం (మోక్షం)ను పొందగలడు.

**దండనీయులు**

**శ్లో॥ గురోరప్యవలిప్తస్య కార్యాకార్యమజానతః।**

**ఉత్పథప్రతిపన్నస్య దండో భవతి శాశ్వతః ॥** మ.భా.శాంతి. 15-5

గర్వాంధుడై కర్తవ్యమేదో, అకర్తవ్యమేదో తెలియక, కుమార్గగామియైనవాడు గురువైనా దండించడం రాజధర్మం. అదే సనాతన మతం.

**శ్లో॥ సప్తాంగస్య రాజ్యస్య విపరీతం య ఆచరేత్।**

**గురుర్వా యది వా మిత్రం ప్రతిహన్తవ్య ఏవ సః ॥**

మ.భా.శాంతి. 15-4

రాజ్యం సప్తాంగం. రాజు, మంత్రి, మిత్రులు, కోశము, దేశం, దుర్గము, సేన. ఈ ఏడు అంగాలతో కూడిన రాజ్యానికి వ్యతిరేకంగా ఆచరించేవాడు, హానిచేసేవాడు గురువైనా, మిత్రుడైనా చంపదగినవాడే.

**శ్లో॥ ఉద్యమ్య శస్త్రమాయాన్తమపి వేదాన్తగం రణే।**

**నిగృహ్ణీయాత్ స్వధర్మేణ ధర్మాపేక్షీ నరాధిపః ॥** మ.భా.శాంతి. 14-4

వేదాంతపారంగతుడు, మహావిద్వాంసుడు, బ్రాహ్మణుడైనా యుద్ధంలో శస్త్రపాణియై ఎదిరించినచో అతనిని ఎదిరించి, బందీగా పట్టుకొని ధర్మాన్ని కాపాడుట రాజుల కర్తవ్యం.

**శ్లో॥ వినశ్యన్తం ధర్మం హి యో౽భిరక్షేత్ స ధర్మవిత్।**

**న తేన ధర్మహాసస్యాన్మన్యుస్తన్మన్యుమృచ్ఛతి ॥**

ఆకతాయియైన బ్రాహ్మణుని ద్వారా నష్టపోతున్న ధర్మాన్ని రక్షించిన రాజు ధర్మజ్ఞుడే. అలాంటి పాపిని చంపినందువలన రాజు ధర్మనాశకుడు కాడు. వాస్తవంగా క్రోధమే అతని క్రోధంతో ఢీకొన్నది.

**శ్లో॥ శత్రోరపి గుణావాచ్యాః । దోషావాచ్యా గురోరపి ॥**

గుణాలెక్కడవున్నా, చివరకు శత్రువునందున్నా, ప్రశంసించవలసిందే. అదేవిధంగా దోషాలెక్కడవున్నా, గురువునందున్నా ప్రకటించవలసిందే.

**శ్లో॥ అపూజ్యా యత్ర పూజ్యన్తే పూజ్యానాం తు వ్యతిక్రమః ।**
**త్రీణి తత్ర భవిష్యన్తి దుర్భిక్షం మరణం భయమ్ ॥**

గౌరవనీయులుగాని వారికి (దుష్టులకు, దుర్మార్గులకు) గౌరవం, ఆదర, సత్కారాలు; పూజ్యులు, పవిత్రులు, లోకకళ్యాణ కారకులైనవారికి అనాదరణ, అవమానం ఎక్కడ జరుగునో అక్కడ మూడు అనర్థాలు సంభవిస్తాయి.

1) దుర్భిక్షం: వర్షాలు లేక పంటలు పండక ప్రజలు అష్టకష్టాల పాలౌతారు.
2) మరణం: ప్రజలు, పశువులు మృత్యువుపాలౌతారు.
3) దారిద్ర్యం: దారిద్ర్య పీడితులై ప్రజలు ఒకరినొకరు చంపుకొంటారు. ఎక్కడ చూసినా ప్రజలు భయభ్రాంతులై పరితపిస్తారు.

**శ్లో॥ మాతా పితాచ భ్రాతాచ భార్యా చైవ పురోహితః ।**
**నాదండ్యో విద్యతే రాజ్ఞో యః స్వధర్మే న తిష్ఠతి ॥**

తల్లి, తండ్రి, సోదరుడు, భార్య, పురోహితుడు వీరిలో ఎవరైనా తన ధర్మాన్ని అనుసరించనిచో రాజుచేత దండింపబడుదురు. రాజుకు (ప్రభుత్వానికి) దండనీయుడు కాని వాడెవడూ ఉండడు.



# గుర్వష్టకమ్- గురువు గొప్పతనం

శ్రీ ఆదిశంకరాచార్య విరచితం

1. శరీరం సురూపం తథా వా కళత్రం
యశ శ్చారు చిత్రం ధనం మేరుతుల్యమ్ ।
గురోరఙ్ఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం
తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥

చక్కని రూపం గల అందమైన భార్య ఉన్నప్పటికీ, గొప్ప కీర్తి, మేరు పర్వతమంత డబ్బు ఉన్నప్పటికీ పరమేశ్వరుణ్ణి తెలిపే గురువు పాదాల వద్ద నిలపలేని మనస్సు ఉండి ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం?

2. కళత్రం ధనం పుత్రపౌత్రాది సర్వం
గృహం బాంధవాః సర్వమేతద్ధి జాతమ్ ।
గురోరఙ్ఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం
తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥

భార్య, సంపద, పుత్రులు, మనుమలు, మంచి ఇల్లు, బంధువులు మొదలగునవి ఉండి గొప్ప కుటుంబములో పుట్టినప్పటికీ, పరమేశ్వరుణ్ణి తెలిపే గురువు పాదాల వద్ద నిలపలేని మనస్సు ఉండి ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం?

3. షడఙ్గాదివేదో ముఖే శాస్త్రవిద్యా
కవిత్వాది గద్యం సుపద్యం కరోతి ।

గురోరఙ్ఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం

**తతః కిం తతః కిం తతః కిమ్॥**

నాలుగు వేదాల లోనూ, ఆరు వేదాంగాల లోనూ, పారంగతుడైనా, గద్య, పద్య రచనలలో ప్రజ్ఞావంతుడైనా పరమేశ్వరుణ్ణి తెలిపే గురువు పాదాల వద్ద నిలపలేని మనస్సు ఉండి ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం?

4. విదేశేషు మాన్యః స్వదేశేషు ధన్యః

సదాచారవృత్తేషు మత్తో న చాన్యః ।

గురోరఙ్ఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం

**తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

విదేశాలలో గొప్పగా గౌరవమున్నా, స్వదేశంలో ధనవంతునిగా ఉన్నా, సదాచారవృత్తి గలవానిగా జీవించువాడని పొగడబడినా పరమేశ్వరుణ్ణి తెలిపే గురువు పాదాల వద్ద నిలపలేని మనస్సు ఉండి ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం?

5. క్షమామణ్డలే భూప భూపాలవృన్దైః

సదా సేవితం యస్య పాదారవిన్దమ్ ।

గురోరఙ్ఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం

**తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

ఒక దేశానికి రాజైనా, ఎందరో రాజులు, రారాజులు సేవించినా పరమేశ్వరుణ్ణి తెలిపే గురువు పాదాల వద్ద నిలపలేని మనస్సు ఉండి ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం?

6. యశో మే గతం దిక్షు దానప్రతాపాత్
జగద్వస్తు సర్వం కరేయత్ ప్రసాదాత్ ।
గురోరఙ్ఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం ।
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

దానగుణం వలన కీర్తి అన్ని దిశలలో వ్యాపించినా, ప్రపంచం మొత్తం తన పక్షాన ఉన్నప్పటికీ పరమేశ్వరుణ్ణి తెలిపే గురువు పాదాల వద్ద నిలపలేని మనస్సు ఉండి ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం?

7. న భోగో న యోగో న వా వాజిరాజౌ
న కాన్తాసుఖే నైవ విత్తేషు చిత్తమ్ ।
గురోరఙ్ఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

భోగము, యోగము, అగ్నిహోత్రము, స్త్రీసుఖము, ధనమునందు శ్రద్ధ చూపనప్పటికీ పరమేశ్వరుణ్ణి తెలిపే గురువు పాదాలవద్ద నిలపలేని మనస్సు ఉండి ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం?

8. అరణ్యే న వా స్వస్య గేహే న కార్యే
న దేహే మనో వర్తతే మే త్వనర్ఘ్యే ।
గురోరఙ్ఘ్రిపద్మే మనశ్చేన్న లగ్నం
**తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ ॥**

అడవిలో, ఇంటిలో ఉండాలని కోర్కెలేని వారైనా, ఏదైనా సాధించాలని గాని, తన వంటిమీద శ్రద్ధ లేనివారైనగాని పరమేశ్వరుణ్ణి తెలిపే గురువు పాదాలవద్ద నిలపలేని మనస్సు ఉండి ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం? ఏమి లాభం?

